# చైనా
# నూతనప్రజాస్వామికం

మా - సీ - యుంగ్



అనువాదం:
పి. వి. శివయ్య



ప్రజాశక్తి ప్రచురణాలయం
బెజవాడ

# ముందుగా అనువాదకుని మాటలు

చైనాకమ్యూనిస్టుపార్టీనాయకుడైన మావ్-సె-టుంగ్ 1940 లో యీ పుస్తకం రాశాడు. ఫేసిస్టు దురాక్రమణ దండయాత్రకు గురైన దేశాలు ఆత్మరక్షణకొరకు సాగించే ధర్మయుద్ధంలో జయించి 'నూతన ప్రజాస్వామిక ప్రభుత్వాల' నేర్పరచుకోగలవని సిద్ధాంతీకరించాడు. రష్యన్ సోషలిస్టు విప్లవానంతరం ప్రారంభమైన నూతన యుగంలో బూర్జువా ప్రజాతంత్ర విప్లవవాలు, బూర్జువానాయకత్వానగాక శ్రామిక వర్గ నాయకత్వాన జరుగుతాయనీ, ఫలితంగా యేర్పడగల ప్రభుత్వాలు పూర్వపు యింగ్లాండు, ఫ్రాన్సు, అమెరికాల్లోని బూర్జువా నియంతృత్వ స్వభావంగల "ప్రజాతంత్ర ప్రభుత్వాలు కాజాలవని, సామ్రాజ్య వాదానికి, జమీందారీ విధానానికి వ్యతిరేకంగా నిలచి ప్రతిఘటనోద్యమం సాగించిన పార్టీ లన్నిటి యొక్క నియంతృత్వరూపమైన నూతన ప్రజాతంత్ర ప్రభుత్వాలేర్పడతాయనీ వీటిలో రాజీవాదులూ, దేశద్రోహులూ, ప్రజాశత్రువులూ ఐన కరుడుగట్టిన పెట్టుబడిదారులకూ, జమీందారులకూ తావుండదనీ ప్రతిపాదించాడు. శ్రామికవర్గ నాయకత్వాన యేర్పడగల యీ ప్రభుత్వాలు సంపూర్ణమైన శ్రామిక నియంతృత్వాలు కాజాలవు. సంపూర్ణ సోషలిస్టు ప్రభుత్వాలు కాజాలవు. ప్రైవేటు ఆస్థి సరిహద్దుల్లోనే, హద్దూపద్దూలేని దోపిడిని అరికట్టగల న్యాయమైన ప్రభుత్వాలు గాబట్టి అవి నూతన ప్రజాతంత్ర ప్రభుత్వాలని వాటికి పేరుబెట్టారు.

మావ్ సిద్ధాంతాన్ని చరిత్ర రుజువుచేసింది. ఫేసిస్టు వ్యతిరేక ప్రతిఘటనోద్యమాల్లో నూతన ప్రజాతంత్ర ప్రభుత్వాల బీజాలు మొలకలెత్తి పెరిగి, ఫేసిస్టు ఓటమి తరువాత ఆ యా దేశాల్లో సంపూర్ణ వికాసంతో పరిపాలనాధికారాన్ని వహించాయి. యుగోస్లేవియా, జెకోస్లోవేకియా, రుమేనియా, బల్గేరియా, పోలెండు, ఇటలీల్లో యిలాంటి ప్రభుత్వాలేర్పడ్డాయి. ఫ్రాంసులో నూతన ప్రజాతంత్రానికి స్థిరత్వం ఏర్పడలేదు. ఫ్రెంచి బూర్జువాలు ప్రతిఘటనోద్యమంలో పాల్గొని ప్రతిష్ట సంపాదించడం, ఫ్రెంచి సోషలిస్టులు దిగజారుడు విధానం యిందుకు కారణాలు. ఫేసిస్టు ప్రతిఘటనోద్యమంలో అందరికన్నా గట్టిగా పోరాడిన ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ పార్లమెంటులో మొదటి పార్టీగా వచ్చింది గాని, మెజారిటీపార్టీగా రాలేదు. సోషలిస్టులు కమ్యూనిస్టుపార్టీతో ఐక్యతను నిరాకరించారు. కాబట్టి సామ్రాజ్యవాదులింకా ఫ్రాంసులో బలమైన స్థానాల్లోనే ఉన్నారు.

ఇంగ్లండులో చర్చిల్ నాయకత్వాన కన్సర్వేటివు, లేబర్, లిబరల్, ఇండిపెండెంటు, లేబరుపార్టీల సంయుక్త "జాతీయ ప్రభుత్వం" యుద్ధం సాగించి జయించింది. యుద్ధానంతర దేశపునర్నిర్మాణ బాధ్యతల నెత్తిచూపి చర్చిల్ ముఠాను ఓడగొట్టి లేబరుపార్టీ అధికారంలోకి వచ్చింది. కాని లేబరుప్రభుత్వం సోవియట్ యెడల, ఇండియా మొదలైన కామన్వెల్తు బానిసదేశాల యెడల చర్చిల్ ప్రభుత్వ విధానాన్నే అనుసరిస్తూంది. ఇంగ్లీషు కమ్యూనిస్టుపార్టీ యుద్ధకాలంలో సంఖ్యలోనూ, పలుకుబడిలోనూ పెరిగినా, ఇంకా

లేబరు ప్రభుత్వంయొక్క సామ్రాజ్య విధానాన్ని పూర్తిగా మార్చివేయ గలిగినస్థితిలోకి రాలేదు.

నేడు యుద్ధకారణంగా విపరీతంగా బలపడిన అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రపంచ దురాక్రమణకొరకు సోవియటుకు వ్యతిరేకంగా మూడో ప్రపంచం యుద్ధంకొరకు రెచ్చగొడ్తున్నారు. ఇంగ్లండు లేబరుసామ్రాజ్యవాదం ఆమార్గాన్నే నడుస్తున్నది. అంతులేని బలసంపదలతో, నూతనసమాజానికీ, శాంతి అభ్యుదయాలకు పెట్టనికోటయైన సోవియట్ యూనియన్, సోవియటు మిత్రమండలిలో చేరిన నూతన ప్రజాతంత్రాలూ, స్వతంత్రాన్ని కాంక్షించిపోరే వలసదేశాలూ, బానిస దేశాలూ, ప్రపంచంలోని పీడితప్రజానీకమూ, కలసిన విశాల ప్రజా సంఘటన అమెరికా, ఇంగ్లీషు, సామ్రాజ్యవాదాల నెదుర్కొని మూడవ యుద్ధాన్ని రాకుండా అరికట్టడమే ఏకైక లక్ష్యం.

జపాను ఓడిపోయింది. చియాంగ్-కే-షేకు అమెరికా ఆయుధ బలంతో చైనా కమ్యూనిస్టులను నాశనం చేయాలని; కమ్యూనిస్టుల పలుకుబడిలో ఉన్న షెన్సీ-కన్సూ-నింగ్షియా సరహద్దు రాష్ట్రాలపైనా, మంచూరియాపైనా దండయాత్రలు సాగిస్తున్నాడు. కమ్యూనిస్టు ముఖ్య పట్టణమైన యేనాన్ పై దృష్టిని కేంద్రీకరించాడు. నేడు చైనాలో జపాను వ్యతిరేక యుద్ధాన్ని మించిన యెత్తులో అంతర్యుద్ధం అతిదారుణంగా జరుగు తూన్నది. ఈ అంతర్యుద్ధానికి కారణం చియాంగ్-కే షేకు, అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రోత్సాహకులూ సహాయకులూ. చైనాను సోవియట్ వ్యతిరేక రంగంగా తయారు చేయాలని అమెరికా యెత్తు.

చైనా కమ్యూనిస్టులు ఆత్మరక్షణ కొరకు, చైనా ఐక్యతకొరకు, చైనానూతన ప్రజాస్వామికంకొరకు, ప్రపంచ అభ్యుదయం కొరకు ధర్మయుద్ధం చేస్తున్నారు. 12 లక్షల పార్టీ సభ్యులూ 10 లక్షల సాయుధ సైన్యం, 30 లక్షల ప్రజారక్షణ దళ సైన్యమూ, దాదాపు 20 కోట్ల ప్రజానీకము పైన నాయకత్వం కలిగిన చైనా స్వాతంత్ర్య సంఘటన జయించి తీరుతుంది. ఈ అంతర్యుద్ధంలోనుంచి స్వాతంత్ర్య వీరుల పవిత్ర రక్త పరితర్పణతో చైనా నూతన ప్రజాస్వామికాంకురము పెరిగి మహావృక్షమై స్థిరపడగలదు. మావ్ మాట కలగాదు. భవిష్యత్తును నిర్ణయించిన సత్యమని ఋజువు కాగలదు. మావ్ చైనా భావి భాగ్యానికి "లెనిన్" అన్నది సార్థక మాతుంది.

ఇండియా చరిత్రకూ చైనా చరిత్రకు ఎంతో పోలిక ఉన్నది. పేర్లూ, తారీకులూ మార్చితే రెంటి చరిత్రలకూ పాఠం ఒకటేననిపిస్తుంది. విదేశ సామ్రాజ్యవాద పెత్తనం-రాజీకి పాకులాడే నాయకత్వంక్రింద బ్రహ్మాండమైన జాతీ యోద్యమము - రాజీకి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా విశాల జాతీయైక్య సంఘటనకొరకు కృషిచేసే కమ్యూనిస్టుపార్టీ. ఇవి రెండు దేశాలకు సామ్యము. అందు లోనూ యీనాడు రాష్ట్ర ప్రభుత్వాల్లోనూ, తాత్కాలిక కేంద్ర ప్రభుత్వాల్లోనూ, కూర్చున్న జాతీయ నాయకత్వం నడిచే ధోరణిచూస్తే 1927నుంచీ ఇరవైయేళ్లూ చైనా నడచిన కంటకావృత భయంకర కష్ట మార్గాన నడవటం ఇండియాకుగూడా తప్పనట్లే తోస్తుంది.

ఐ. యన్. యే ప్రదర్శనాలూ, నావికుల తిరుగుబాటూ

మొదలుకొని మన దేశంలో చెలరేగుతూన్న విప్లవ ప్రజా సంరంభం ఐక్య సంఘటనను నిర్మించి ప్రపంచ ప్రజాసంఘటన సాయంతో ఇంగ్లీషు సామ్రాజ్యవాదాన్నీ, సంస్థానాధీశులు, దేశముఖులు, జాగీర్‌దారీ, జమీందారీల రూపంలోవున్న మధ్యయుగపు అభివృద్ధి నిరోధక వర్గాన్ని కూలదోయగలదు. చైనాలోవలె మనగడ్డపైన భారత నూతన ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నిర్మించ గలదు.

భారత కమ్యూనిస్టులు ఉజ్వల భారత నూతన ప్రజాస్వామిక స్థాపనకు తమ జీవితాల నంకితం చేశారు.

చైనా నూతన ప్రజాస్వామికం వర్ధిల్లాలి!
భారత నూతన ప్రజాస్వామికం వర్ధిల్లాలి!
స్వతంత్ర భారత్ కు జై!
విప్లవం వర్ధిల్లాలి!

# ప్రస్తావన

1937 లో జపానుతో యుద్ధం ప్రారంభం అయినప్పటి నుంచీ 'కొమింటాంగు కమ్యూనిస్టు పార్టీలమధ్య అంతర్యుద్ధం ఆగిపోయింది. ఐక్యతతో శత్రువు నెదుర్కొనగల అవకాశం కలిగింది'. చైనా ప్రజల హృదయాల్లో ఆశలు రేకెత్తాయి. చాల హుషారుగా ఉంటూవచ్చారు. ఉజ్వల భవిష్యత్తు కొరకు ఆహ్లాదకరంగా ఎదురు చూస్తూ వచ్చారు. ఇటీవల శత్రువుతో రాజీ చేసుకోవాలనే సిద్ధాంతాలూ, కమ్యూనిస్టు వ్యతిరేక దుష్ప్రచారాలూ మరల చెలరేగాయి. తిరిగి దేశమంతా అంధకారంలో ముసిగింది. "ఏమిటి చెయ్యడం?" "చైనా గతేంగాను?" ఇల్లా ఆదుర్దా కరమైన ప్రశ్నలు యుద్ధరంగంలో తలెత్తాయి. ఇలాంటి విషయాలంటే, మిగిలిన వాళ్ళకన్నా ఎక్కువఆసక్తి చైతన్యమూ కలిగిన విద్యార్థులను, రచయితలనూ, ఈప్రశ్నలు ఎక్కువగా కలవర పెడ్తున్నాయి.

"చైనా ప్రజల సంస్కృతి" అనేపుస్తకం ప్రచురింపబడే సందర్భాన్ని అవకాశంగా తీసుకొని, చైనా రాజకీయాల యొక్క, సంస్కృతియొక్క దృక్పథాన్ని, పోకడలనూ సంగ్రహంగా పేర్కొనడం, ఉపయోగకర మనుకుంటాను. దేశమంతటా చర్చించి తద్వారా చైనా సంస్కృతియొక్క భవిష్యత్తును గురించి సరియైన సారాంశాలు తేల్చ గలిగితే మనజాతికి శ్రేయస్కరమనుకుంటాను. అలాంటి చర్చకు ప్రాతిపదికగా నా యీ వ్యాసం ఉపయోగ పడుతుందని ఆశిస్తున్నాను.

ఒక్కటి మట్టుకు ముందుగా చెప్పాలి. "ఆచరణ ద్వారానే సత్యాన్వేషణ చెయ్యడం" ఒక్కటే శాస్త్రీయ మైనమార్గం. "ఆత్మభూషణా అహంభావము" సత్యాన్వేషణ కుపకరించవు. నేడు మన నెదుర్కొన్న వినాశకర పరిస్థితుల్లో శాస్త్రీయమైన మార్గాన్ననుసరిస్తే తప్ప మనపైనున్న బాధ్యతేదో గ్రహిస్తేనే తప్ప మనకు రక్షణలేదు. మనం స్వాతంత్ర్యాన్ని పొందలేము. ఏప్రశ్నకైనా ఒకే ఒక సరైన సమాధానముంటుంది. సత్యమేది అన్నది ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు నిర్ణయించడానికి వీల్లేదు. వాస్తవికదృష్టిపైన ఆధార పడిన ఆచరణ ద్వారానే, సత్యమిది యని నిర్ణయించబడాలి.

చైనాలో కమ్యూనిస్టులం, ఆర్థిక రాజకీయ విప్లవాలను నడపడానికే కాక, సంస్కృతీ పరిణామాలను దిద్దడానికూడా చాలకాలంనుంచీ కృషిచేస్తున్నాం. చైనా ప్రజలను ఒక నూతన సమాజంగా ఒక నూతన జాతిగా నిర్మించడం మన కృషిలో ఉద్దేశం. అలాంటి నూతన సమాజంలో, అలాంటి నూతన జాతిలో, కొత్త ఆర్థిక రాజకీయ వ్యవస్థల తోపాటు, ఒక కొత్త సంస్కృతికూడా జన్మించాలి. అంటే రాజకీయంగా అణగదొక్కబడి ఆర్థికంగా దోపిడీ చేయబడుతూన్న చైనాను, రాజకీయ స్వాతంత్ర్యమూ, ఆర్థికాభ్యుదయమూ, అనుభవించే చైనాగా మార్చడమే గాకుండా, పాత నాగరికత గలిగి వెనుకబడిఉన్న చైనాను, నూతన సంస్కృతి వెలుగుల్లో ముందు నడిచే జాతిగా మార్చాలి. క్లుప్తంగా చెప్పాలంటే మనం నూతన చైనాను నిర్మించాలి. నూతన సంస్కృతిని నిర్మించాలి. అయితే, ఆ నూతన సంస్కృతి యెలాంటిదిగా ఉండాలి ?

సమాజంలోవున్న ఆర్థిక రాజకీయ వ్యవస్థల ప్రతిబింబమే దాని సంస్కృతి; ఆర్థిక సంబంధాల ప్రతిబింబమేదాని రాజకీయాలు– అంటే ఒకానొక సమాజంయొక్క సంస్కృతీ ప్రభావం, దాని సమకాలికమైన ఆర్థిక రాజకీయ సంబంధాల మీద చాల ఉంటుంది. ఆర్థిక రాజకీయాలకూ, సంస్కృతికీ, మధ్యఉండే సంబంధాన్ని గురించీ, ఆర్థిక రాజకీయాలకుమధ్య ఉండే సంబంధాన్ని గురించీ మా ముఖ్య అభిప్రాయం యిదే. సారాంశ మేమంటే ఆర్థిక రాజకీయ వ్యవస్థల స్వరూపమే సమకాలిక సంస్కృతీ స్వరూపాన్ని నిర్ణయిస్తుంది. మరల అలాంటి సమకాలిక సంస్కృతీ స్వరూపంయొక్క ప్రభావం ఆ ఆర్థికరాజకీయ స్వరూపాలమీద ప్రసరిస్తుంది.

"సామాజిక చైతన్యం సామాజికజీవితాన్ని నిర్ణయించదు" అన్నాడు కారల్ మార్క్స్. "ఈ విశ్వం యిలాంటిదలాంటిదని నిర్వచించడానికి ప్రయత్నిస్తూ వచ్చారు తత్వవేత్తలు. కాని విశ్వాన్ని మార్చడమెలాగనేదే ముఖ్యమైన విషయం" అనికూడా అన్నాడు. చైతన్యానికీ, జీవితానికి గలసంబంధాన్ని నిర్ణయిస్తూచేసిన నిర్వచనాల్లో మానవ చరిత్ర అంతటిలోనూ మొట్టమొదటి శాస్త్రీయ నిర్వచనం మార్క్సేచేశాడు. ఈనిర్వచనాన్ని ఆధారంచేసుకునే, లెనిన్ తన బుద్ధివిశేషంతో "జ్ఞాన సిద్ధాంతాన్ని" * విప్లవ

* వస్తువుల ప్రతిబింబాలు మన మెదడుపై బడడంవల్ల మనకు వాటి స్వరూప స్వభావాలు తెలుస్తాయి. చర్మమూ, కన్నూ, ముక్కూ నాలుక చెవి యివిపంచేంద్రియాలు. స్పర్శ, దృష్టి, వాసన, రుచి, శ్రవణం యివి పంచేంద్రియాల కార్యకలాపాలు - పంచతన్మాత్రలు. వీటిద్వారా మనచుట్టూ ఉండే ప్రకృతియొక్క జ్ఞానం మనకు కలిగే విధానాన్ని వివరించేది "జ్ఞానసిద్ధాంతం". Theory of reflections లేక Theory of knowledge' (అనువాదకుడు.)

కరంగా సిద్ధాంతీకరించి ఎంతో అభివృద్ధిచేశాడు. సంస్కృతిని గురించిన సమస్యలను పరిశీలించేప్పుడు యీ విషయాన్ని మరువగూడదు.

ఇప్పుడు బాగా విశదమై ఉంటుంది. మనం వదలి వేయవలసిన పాత సంస్కృతిని, ఆనాడు దేశంలో ఉన్న ఆర్థిక రాజకీయ సంబంధాలతో జోడించి పరిశీలించవలసిఉంటుంది. మనం నిర్మించవలసిన నూతన సంస్కృతిని, మనజాతియొక్క నూతన ఆర్థిక రాజకీయ నిర్మాణాన్ని దృష్టిలో పెట్టుకొని పరిశీలించాలి. చైనాజాతియొక్క పాతరాజకీయాలూ, పాత ఆర్థిక వ్యవస్థా, పాత సంస్కృతికి పునాదులు. నూతనరాజకీయాలూ నూతన ఆర్థికవ్యవస్థా నూతన సంస్కృతికి పునాదులుగా ఉండాలి.

# చైనా రాజకీయాలు ; పాతా - కొత్తా

అయితే చైనా జాతియొక్క ఆ పాతరాజకీయాలూ, ఆ పాత ఆర్థిక విధానమూ, ఆ పాత సంస్కృతీ ఎలాంటివి ?

పురాతన చౌ, చిన్ వంశాల (క్రీ.పూ. 1100–క్రీ పూ 700) నాటినుంచీ కిందటి శతాబ్దంవరకూ, చైనాజాతి జమీందారీ విధానంలో ఉండేది. దాని రాజకీయాలు, జమీందారీ విధాన రాజకీయాలు ; ఆర్థిక విధానం జమీందారీ ఆర్థిక విధానం ; కాబట్టి సంస్కృతిగూడా అప్పటి ఆర్థిక రాజకీయ విధాన ప్రతిబింబమే కావడంచేత జమీందారీ విధాన సంస్కృతిగా తప్ప మరోరూపాన ఉండటానికి వీల్లేక పోయింది.

కాని, క్రీ.శ. 1843 నాటి నల్లమందు యుద్ధానికీ 1894–95 చీనా - జపాను యుద్ధానికీ మధ్యకాలంలో క్రమేణా పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిఅయింది. క్రమేణా వలస దేశంగా మారుతూ వచ్చింది ; జమీందారీ విధానం క్షీణిస్తూ వచ్చింది. ఇప్పుడు, ఆక్రమిత ప్రాంతాలు వలస ప్రదేశాలుగా ఉన్నై. అక్కడి ఆర్థికవిధానం ముఖ్యంగా క్షీణిస్తూన్న జమీందారీ విధానంగా (Semifuedal Structure) ఉంది. స్వతంత్రంగా ఉన్నరోజుల్లోగానీ జపాను ప్రభుత్వం క్రిందవున్నప్పుడుగాని, మన సామాజిక నిర్మాణంలో మొత్తంమీద జమీందారీపద్ధతే ప్రబలంగాఉంటూ వచ్చింది. నాటిచైనా సమాజం అలాంటిది. నేటి చైనాసమాజ పరిస్థితులుగూడా అవే. ఈ సమాజంయొక్క పరిపాలనా, రాజకీయాలూ, ఆర్థిక విధా

నమూనా కొంత వలసదేశ లక్షణాలు కల్గి క్షీణిస్తూన్న జమీందారీ పద్ధతిలో ఉన్నాయి. కాబట్టి, సహజంగా ఈ రాజకీయాలకూ, ఆర్థిక విధానానికీ ప్రతిబింబంగానే సంస్కృతిగూడా కొంతవలస లక్షణాలు, కొంత జమీందారీ విధాన లక్షణాలు కలిగి ఉంది.

ఈ ఆర్థిక, రాజకీయ సంస్కృతీ రూపాలన్నిటినీ విప్లవంద్వారా నాశనంచేసి వాటిస్థానే చైనాలో కొత్తరాజకీయ ఆర్థిక, సంస్కృతులను నిర్మించాలి.

చైనా జాతియొక్క ఆ కొత్త రాజకీయాలూ, కొత్త ఆర్థిక విధానమూ ఎలాంటివి? ఆ కొత్త సంస్కృతి ఎలా ఉండాలి?

చైనా విప్లవం ఎలానడుస్తున్నదో మొదట చూద్దాం. చైనావిప్లవం రెండుదశల్లో నడుస్తుందనీ (1)ప్రజాస్వామిక విప్లవదశ (2) సోషలిస్టు విప్లవదశ అని మనకు తెలుసు. ఈదశలకు ప్రత్యేకత ఉంది. ఈప్రజాస్వామిక విప్లవం పూర్వపు ప్రజాస్వామికం యొక్క అర్థంలో వాడ బడలేదు. ఇది ఒక కొత్త నమూనా ప్రజాస్వామికం లేక నూతన ప్రజా స్వామికం.

అందువల్ల మనం గట్టిగా చెప్పొచ్చు: చైనా జాతియొక్క నూతన రాజకీయాలు "నూతన ప్రజాస్వామిక" రాజకీయాలుగా ఉండాలి. నూతన ఆర్థికవిధానం "నూతన ప్రజాస్వామిక" ఆర్థిక విధానంగా ఉండాలి. నూతన సంస్కృతి "నూతన ప్రజాస్వామికం" యొక్క సంస్కృతిగా ఉండాలి.

ఇదే, చైనా విప్లవంలో ప్రస్తుతదశయొక్క చారిత్రక ప్రత్యేకత. చైనా విప్లవానికి అంకితాలైన అన్ని రాజకీయ

పార్టీలూ అందరు వ్యక్తులూ ఈ ప్రత్యేకతనూ, విలక్షణ త్వాన్నీ మరవకూడదు. మరిచారా, విప్లవం జయప్రద మయ్యేట్లు నడపలేరు, పోరాడలేరు. ప్రజలు అలాంటి పార్టీ లనూ, వ్యక్తులనూ వెనక్కి దిగ దొక్కుతారు.

## విప్లవం యొక్క రెండు దశలు

చైనా విప్లవం యొక్క చారిత్రక ప్రత్యేకత యేమంటే, అది రెండు దశలలో నడవాలి. మొదటిదశ ప్రజాస్వామిక విప్లవదశ. అయితే ఆ ప్రజాస్వామికం నూతనమైనది; ఒక ప్రత్యేక విధమైనది; చైనా చరిత్రలో జన్మించిందిగా ఉండాలి. అదే "నూతన ప్రజాస్వామికం." ఇక్కడొక ప్రశ్న అడ గొచ్చు. చైనాయొక్క అభివృద్ధి క్రమంలో వచ్చిన యీ చారిత్రక ప్రత్యేకదశ నేటి యీస్వరూపాన్ని ఎందుకుపొందింది? గడచిన శతాబ్దం పొడుగునా యీ రూపంలో యిలాగే ఉందా? లేక యిటీవల యేర్పడ్డదా?

చైనా చరిత్రనూ, ప్రపంచ చరిత్రనూ, ఒకమారు చూస్తే చైనావిప్లవంలోనే ఈచారిత్రక ప్రత్యేకదశ మొదటి ప్రపంచయుద్ధం అయిపోయేదాకా రాలేదని తెలుస్తుంది. ఈ ప్రత్యేకదశ యెలా వచ్చిందో క్లుప్తంగా తెలుసుకుందాం.

ఇప్పటి చైనా సమాజం క్షీణిస్తూన్న జామీందారీ లక్షణాలను, కొంతవరకు వలసవిధాన లక్షణాలనూ కలిగి ఉన్నదన్నట్లైతే, చైనావిప్లవం గూడా రెండుదశల్లో నడుస్తుంద నాలి. మొదటిదశలో వలసవిధానాన్ని, క్షీణిస్తూన్న జమీం దారీ లక్షణాలుగల సమాజాన్ని స్వతంత్ర ప్రజాతంత్ర సమా

జంగా మార్చాలి; రెండవదశలో సోషలిస్టు సమాజనిర్మాణం కొరకు విప్లవాన్ని పెంపొందించాలి. చైనావిప్లవం ప్రస్తుతం పైన జెప్పబడ్డ మొదటిదశలో ఉంది.

మొదటిదశ (1839-43) నల్లమందు యుద్ధంతో ఆరంభమైనదనవచ్చు. "అప్పటినుంచీ జమీందారీ విధానం క్షీణిస్తూ, వలసవిధానం ప్రవేశించడం మొదలెట్టింది. తరువాత వరుసగా, అంతులేని ప్రవాహంగా పోరాటాలు జరిగినై. [తాయిపింగ్ తిరుగుబాటు (1850–64) చైనా ఫ్రెంచియుద్ధం (1894)సంస్కరణోద్యమం (1908)విప్లవం[1911]"మే నాల్గు" విద్యార్థిఉద్యమం [1919] 'మే 30 సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమం [1925] వ్యవసాయక విప్లవం, జపాను సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమం [1935] నేటిజపాను వ్యతిరేకయుద్ధం.] ఈపోరాటాలన్నీ ఆయా కాలాల్లో కొద్దోగొప్పో సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగానూ, జమీందారీ ప్రాబల్యానికి వ్యతిరేకంగానూ జరుపబడ్డ పోరాటాలే. స్వతంత్ర ప్రజాతంత్ర సమాజాన్ని స్థాపించడానికి, అంటే చైనావిప్లవ ప్రధమదశను పూర్తి జేయడానికి జరుపబడ్డవి. 1911 విప్లవంతో ప్రజాతంత్ర విప్లవదశ ప్రారంభమైనదని ఎక్కువ స్పష్టంగా తెలుసుకోగలిగా మనవచ్చు. కానిఅది శ్రామిక విప్లవం కాదు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం మాత్రమే. ఈబూర్జువా ప్రజాతంత్రవిప్లవం పూర్తిగావ డానికే ఇంకా కొంతకాలం పడుతుంది. ప్రజాతంత్ర వ్యతిరేకు లింకాబలంగా నేడున్నారు, "కామ్రేడ్స్! విప్లవంపూర్తిగాలేదు. యింకా పోరాడాలి" అని డాక్టర్ సన్‌యట్‌సేన్ హెచ్చరించాడు.

కాని మొదటి ప్రపంచయుద్ధం తరువాత ప్రపంచ పరి

స్థితులు మారిపోయాయి. 1917 లో రష్యావిప్లవం జరిగింది. ప్రపంచంలో ఆరో వంతు భూమిపైన సోషలిస్టు ప్రభుత్వమేర్పడ్డది. దీనితో చైనా బూర్జువా ప్రజాస్వామిక విప్లవ పరిస్థితుల్లో మార్పువచ్చింది.

అంతకుపూర్వం, చైనా బూర్జువా ప్రజాస్వామిక విప్లవం ప్రపంచ, బూర్జువా ప్రజాస్వామిక విప్లవంలో ఒక భాగంగా ఉండేది. తరువాత దాని స్వభావం మారింది. ప్రపంచ శ్రామిక విప్లవంలో సోషలిస్టు విప్లవంలోభాగమై పోయింది.

ఈ మార్పెలా వచ్చింది? మొదట సామ్రాజ్యవాద యుద్ధంవల్లా, మొదటి సోషలిస్టు విప్లవం జయప్రదంగావడం చేతా; ప్రపంచచరిత్ర నడిచే పంథాయే మారిపోయింది. అందువల్ల యీ నూతనయుగం ప్రారంభమైంది.

భూగోళంలో ఆరవవంతు భాగంలో ప్రపంచ పెట్టుబడిదారీ సంఘటన భగ్నమై పోయింది. మిగిలిన రంగాల్లో గూడా యిప్పటి కప్పుడే ఊగిసలాడు తూంది. వలస దేశాలనూ, బానిస దేశలనూ పట్టుకుని వ్రేళ్ళాడితేనే తప్ప మిగిలిన పెట్టుబడిదారీ ప్రపంచం నిలిచేదిక్కు లేదు; సోషలిస్టు ప్రభుత్వం అమల్లోకివచ్చి, వలస దేశాల యొక్క బానిస దేశాల యొక్క జాతీయ స్వాతంత్రోద్యమాలకు సాయం చేస్తానని అభయ మిచ్చింది. పెట్టుబడిదారీ దేశాల కార్మిక వర్గం రానురాను సోషల్ డెమాక్రటిక్ పార్టీల-అంటే మిత వాద సోషలిస్టు పార్టీల-పలుకుబడినుంచి వై దొలగి పోతూన్నది. వలస దేశాల స్వాతంత్ర్యోద్యమాలను బలపరుస్తూన్నది. కాబట్టి యిలాంటి పరిస్థితుల్లో ఏ బానిస దేశంలోనైనా వలస

దేశంలో నైనా, ఏ పీడిత దేశంలోనైనా ఎలాంటి సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమం అభివృద్ధి చెందినా ఆ విప్లవోద్యమం యికయెంతమాత్రమూ బూర్జువా ప్రజాస్వామిక సరిహద్దుల్లో ఉండజాలదు! నూతన ప్రజాస్వామిక విప్లవ సరిహద్దుల్లోకి వచ్చేస్తుంది. ప్రపంచ శ్రామిక విప్లవంలో భాగమైపోతుంది. ఇలాంటి విప్లవోద్యమం అభివృద్ధిచెందే వలసదేశాలనూ, పీడిత దేశాలనూ యికయెంత మాత్రమూ ప్రపంచ పెట్టుబడిదారీసంఘటనలో భాగస్వాములుగా పరిగణించరాదు. ప్రపంచ సోషలిస్టు విప్లవ సంఘటనలో భాగస్వాములుగానే పరిగణించాలి.

వలసదేశాల్లో విప్లవంయొక్క మొదటిదశ అక్కడి సమాజాన్నిబట్టి బూర్జువా ప్రజాస్వామిక విప్లవమే అవుతుంది. అక్కడవున్న పరిస్థితులనుబట్టి ముఖ్యంగా పెట్టుబడిదారీ అభివృద్ధికిగల అడ్డంకులను యింకా తొలగించ వలసివుంది. అయినప్పటికీ యీ విప్లవం పూర్వంమాదిరి బూర్జువా విధాన నిర్మాణంకొరకు, బూర్జువావర్గ నియంతృత్వంలాంటి ప్రభుత్వ స్థాపనకొరకు, సంపూర్ణంగా బూర్జువావర్గంచేత నడపబడే విప్లవంమాత్రం కాజాలదు. ఇదింకో కొత్తరకంవిప్లవం. దీని నాయకత్వంలో కొంతభాగంగాని, సంపూర్ణంగాగాని, శ్రామికవర్గం వుంటుంది. దీని ఆశయం, మొదటిదశలో ఒక నూతన ప్రజాతంత్ర సమాజాన్ని, విప్లవవర్గాలన్నిటియొక్క ఐక్యనియంతృత్వ రూపమైన నూతన ప్రభుత్వాన్నీ నిర్మించడమే. విప్లవంయొక్క యీ ముఖ్యస్వభావం సోషలిస్టు దశ వచ్చేంతవరకూ మారదు. విప్లవం నడిచేక్రమంలో మాత్రం శత్రువులయొక్కా, మిత్రులయొక్క వైఖరులలోవచ్చే

మార్పులననుసరించి అనేక చిన్న చిన్న అంతర్దశల ద్వారా నడవవచ్చు.

ఈ రకమైన ప్రజాతంత్ర విప్లవం సామ్రాజ్యవాద ప్రయోజనాలకు సంపూర్ణంగా వ్యతిరేకంగావటంవల్ల వాళ్ళు దీన్ని ఏవగించుకుంటారు. తీవ్రంగా వ్యతిరేకిస్తారు. కాని సోవియటు యూనియనూ, సోషలిస్టు శక్తియైన ప్రపంచ శ్రామిక వర్గమూ దీన్ని ఆహ్వానిస్తాయి. సాయంచేస్తాయి. ఈ విప్లవం ప్రపంచశ్రామిక సోషలిస్టు విప్లవంలో భాగం కాకతప్పదు.

శాస్త్రీయమైన యీ సిద్ధాంతాన్ని మొట్టమొదట 1924 - 27 చైనా విప్లవకాలంలో కమ్యూనిస్టులు ప్రతిపాదించారు. ఆ కాలంలో సామ్రాజ్యవాదానికీ జమీందారీ విధానానికీ వ్యతిరేకంగా పోరాటంలో నిమగ్నులైయున్న వారంతా దీన్ని అంగీకరించారు. అయితే అప్పటికింకా ఆ సిద్ధాంతం సూత్రప్రాయంగానే ఉండి ఇంకా అభివృద్ధి చేయవలసిన స్థితిలోనే ఉంది. 1926 చెక్ వ్యతిరేకోద్యమ సమయంలో చియాంగ్ - కై - షేకు [కార్టన్‌లో ఉంటున్నాడుగా నని జ్ఞాపకం] ఒక బహిరంగసభలో చైనా విప్లవం ప్రపంచ విప్లవంలో ఒకభాగం” అన్నాడు.

నేను సూచించిన ప్రపంచవిప్లవం పాత అర్థంలో ప్రపంచ విప్లవంగాదు. పాత బూర్జువా ప్రపంచ విప్లవకాలం ఎన్నడో గడిచింది. ఇప్పుడిది కొత్తప్రపంచ విప్లవం. సోషలిస్టు ప్రపంచ విప్లవం. మన విప్లవం సహజంగా సోషలిస్టు ప్రపంచ విప్లవంలో 'ఒకభాగం, పాత బూర్జువా ప్రపంచ విప్లవంలోగాదు. ఇది చాలా పెద్దమార్పు, చైనా చరిత్రలో గాని ప్రపంచ చరిత్రలో గాని కనివిని యెరుగనంత మార్పు.

స్టాలిన్ యొక్క విప్లవసిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని, చైనాకమ్యూనిస్టులు శాస్త్రీయమైన యీసిద్ధాంతాన్ని నిర్మించారు.

1918 లోనే స్టాలిన్ నవంబరు విప్లవ ప్రథమ వార్షికోత్సవాన్ని గురించిన వ్యాసంలో యిలా రాశాడు: "అక్టోబరు విప్లవం యొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యత యేమంటే [1] జాతీయసమస్యయొక్క అవకాశాన్ని విశాలం చేసింది. జాతీయసమస్యఅంటే, జాతీయనిర్బంధానికి వ్యతిరేకంగా, ఏజాతికాజాతి పోరాడడమనే ప్రత్యేక సమస్య మాత్రమేగాదు. ఈనాడా సమస్యను పీడితజాతులనూ, వలస దేశాలనూ సామ్రాజ్యవాదంనుండి విముక్తి పొందించడానికి జరిపే సర్వసాధారణ పోరాట సమస్యగా మార్చి వేసింది. [2] స్వతంత్రాన్ని పొందడానికి విశాలమైన అవకాశాలను కలుగచేసింది. సరియైనమార్గాన్నిచూపి, సామ్రాజ్యవ్యతిరేక పోరాటంలోఉన్న ప్రాచ్యపాశ్చాత్య పీడిత దేశాలను ఐక్య మార్గంలోకి లాక్కొచ్చి జయంపొందడానికి సాయంచేసింది. [3] దీనిద్వారా పాశ్చాత్య సోషలిస్టు దేశానికీ ప్రాచ్యబానిస దేశాలకూ ఒక వారధిని నిర్మించింది. ప్రపంచ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పడమటిదేశాల శ్రామిక వర్గంనుంచి రష్యను విప్లవంద్వారా పీడితులైన తూర్పు దేశ జాతులవరకూ, విప్లవదుర్గ శ్రేణులను నిర్మించింది.

ఈ వ్యాసం ప్రచురింప బడ్డప్పటినుంచి వలస దేశ విప్లవాలనుగురించిన సిద్ధాంతం పాతపంథా వదలిపెట్టింది. శ్రామిక సోషలిస్టుపంథాలో ప్రవేశించింది.

స్టాలిన్ యీ సిద్ధాంతాన్ని "తిరిగిజాతీయ సమస్యలపైన" [1925 జూన్ 30] అనే వ్యాసంలో ఇంకా సునిశితంగా

వివరించాడు. ఆ వ్యాసంలో యుగోస్లోవియా జాతీయవాదులకు వ్యతిరేకంగా వాదిస్తూ యిలా రాశాడు.

"1912 చివర నేను రాసిన" మార్క్సిజమూ—జాతుల సమస్యా, అనే కరపత్రంలో ఒకభాగాన్ని ఉదహరిస్తూన్నాడు క్రామేడ్ సెమిచ్. అందులో జాతీయపోరాటం......... బూర్జువా వర్గాల పరస్పర పోరాటమే అని ఉంది. ఇలా ఉదహరించి, ప్రస్తుత పరిస్థితుల్లో జాతీయోద్యమానికి సమాజ పరమైన అన్వయం తానిచ్చినదే సరియైనదని సెమిచ్ సూచించదలచు కున్నాడు. కాని నేనా కరపత్రం సామ్రాజ్యవాద యుద్ధానికి పూర్వంరాశాను. అప్పటికి జాతీయ సమస్య మార్క్సిస్టుల దృష్టిలో అంత ప్రపంచ ప్రాముఖ్యమైనదిగా అగుపడలేదు. స్వయంనిర్ణయ హక్కు బూర్జువా ప్రజాస్వామికంలో భాగంగా పరిగణించ బడ్డది. శ్రామిక విప్లవ భాగంగా పరిగణించ బడలేదు. ఆరోజుల నుంచీ అంతర్జాతీయ పరిస్థితులు పూర్తిగా మారిపోయాయనీ, ప్రపంచ యుద్ధమూ, రష్యన్ విప్లవమూ వచ్చి, బూర్జువా ప్రజాస్వామిక విప్లవ భాగంగా వున్న జాతీయ సమస్యను శ్రామిక సోషలిస్టు విప్లవభాగంగా మార్చి వేశాయనీ గ్రహించక పోవడం హాస్యాస్పదం. 1916 అక్టోబరులోనే "స్వయం నిర్ణయాధికారంపై చర్చముగింపు" అనే వ్యాసంలో లెనిన్ యిలారాశాడు. జాతీయ సమస్యకు ముఖ్యసూత్రమైన స్వయం నిర్ణయ హక్కు సాధారణ ప్రజాతంత్ర ఉద్యమ భాగంగా ఉండటం మానేసింది. శ్రామిక సోషలిస్టు విప్లవ భాగంగా మారిపోయింది. యికనీజాతీయ సమస్యను గురించి లెనిన్ యొక్క తరవాత వ్రాతలను గానీ, యితర రష్యను కమ్యూ

నస్టునాయకుల వ్రాతలను గానీ ఉదహరించ దలచుకోలేము. బూర్జువా ప్రజాతంత్రయుగంలో యెప్పుడో నేను రాసిన వ్యాసాన్ని ఆ కామ్రేడ్ యీ కొత్త పరిస్థితుల్లో ఉదహరించాడు. ఆయన ఉద్దేశం యేమై ఉంటుందనుకోవాలి? ఏమీ లేదు. చారిత్రక పరిస్థితులకూ, స్థలానికీ, కాలానికీ సంబంధం లేకుండా ఆ వ్యాస భాగాన్ని ఉదహరించాడు. గతి తర్కం యొక్క ప్రాథమిక సూత్రాలనే ఉల్లంఘించాడు. ఒక చారిత్రక పరిస్థితుల్లో ఒప్పు అనుకున్నది మరో చారిత్రక పరిస్థితుల్లో తప్పు గావచ్చుననే విషయం మరిచి పోయినాడు."

పైదాన్నిబట్టి అనేకవిధాలైనవిప్లవాలున్నాయని తెలుస్తుంది. ఒకటి పెట్టుబడిదారీ ప్రపంచవిప్లవం. మొదటిసామ్రాజ్యవాదయుద్ధం వచ్చింతరవాతను, ముఖ్యంగా 1917 ర రష్యన్ విప్లవం జయించిం తరువాతను, పెట్టుబడిదారీ ప్రపంచ విప్లవదశ పోయింది. అప్పటినుంచీ మరోరకమైన ప్రపంచ విప్లవదశ వచ్చింది. అదే ప్రపంచ సోషలిస్టు విప్లవదశ. దానికి పెట్టుబడిదారీదేశాల శ్రామికవర్గం ముఖ్యమైన శక్తి. వలసదేశాల్లోని పీడితజాతులు ఆశ్రామికవర్గంయొక్క మిత్రమండలిలోవి. ఈవిప్లవంలో పాల్గొనేవర్గలూ. పార్టీలూ. వ్యక్తులూ, ఎలాంటి వారైనాసరే, వారికి చైతన్యమున్నాసరే, లేకపోయినాసరే వారంతా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిలుచుని పోరాడుతున్నారు కాబట్టి వారి విప్లవం ప్రపంచ సోషలిస్టు విప్లవంలో భాగమైపోకతప్పదు. వారందరూ ప్రపంచ సోషలిస్టు విప్లవంయొక్క మిత్రమండలిలో చేరకతప్పదు.

కాని ప్రస్తుత పరిస్థితుల్లో చైనావిప్లవం యింకా

ఎక్కువ ప్రాముఖ్యాన్ని వహిస్తుంది. రెండవ ప్రపంచయుద్ధా
అతి భయంకరంగా సాగుతూంది. సోవియట్ యూనియన్
సోషలిజంలోంచి కమ్యూనిజంలోకి ప్రవేశిస్తూంది. ప్రపంచ
నంతటిలోనూ, సామ్రాజ్యవాదానికీ, పెట్టుబడిదారీ విధా
నానికి వ్యతిరేకంగా, శ్రామికవర్గమూ, పీడితజాతులూ,
విప్లవ ప్రజానీకమూ, జరిపే పోరాటానికి సాయం చేయటానికీ,
నాయకత్వం వహించి నడపడానికీ. తగిన శక్తిని సంపాదిం
చింది. పెట్టుబడిదారీ దేశాల్లో శ్రామికవర్గం, పెట్టుబడిదారీ
విధానాన్ని కూలదోసి సోషలిజాన్ని స్థాపించడానికి తయారౌ
తున్నారు. అందులో యీ రోజుల్లో చైనా కమ్యూనిస్టుపార్టీ
నాయకత్వాన, చైనా శ్రామికవర్గమూ, రైతులూ, విద్యా
ర్థులూ, మధ్యతరగతి వర్గమూ ఏకమై బలమైన స్వాతంత్ర
రాజకీయ శక్తిగా తయారైనారు. ఇలాంటి పరిస్థితుల్లో చైనా
విప్లవంయొక్క ప్రపంచ ప్రాముఖ్యత చాల యెక్కువైందా
లేదా? అంటే, ఎక్కువైందంటాను. చైనా విప్లవం నిజంగా,
ప్రపంచ విప్లవంలో ప్రముఖమైనభాగం, మహోజ్వలమైన
భాగం.

ఇది చైనా మొదటిదశకు అన్వయం. ఈ మొదటిదశను
యింకా ఎన్ని చిన్నచిన్న దశల్లోకి విభాగించినా, మొత్తం
మీద సామాజిక స్వభావంలోమట్టుకు యిది కొత్తరకం
బూర్జువా ప్రజాస్వామిక విప్లవమే! యిదింకా సంపూర్ణమైన
సోషలిస్టు విప్లవం గాకపోయినప్పటికీ, తప్పకుండా అందులో
భాగం, అతిముఖ్యమైనభాగం మాత్రం అయిపోయింది.

దానికేగొప్ప మిత్రమైంది. ఈవిప్లవంయొక్క మొదటి
దశమాత్రం చైనాలో బూర్జువా నియంత్రిత్వంక్రింద పెట్టుబడి

దారీసమాజాన్ని ఎన్నటికీనిర్మింపజాలదు. ఈ మొదటిదశలోనే విప్లవవర్గాలన్నిటియొక్క ఐక్యనియంతృత్వంక్రింద కొత్త ప్రజాస్వామికసమాజాన్ని నిర్మించడమే దీనిఉద్దేశం. ఇలా మొదటిదశ పూర్తి అయినతరువాత చైనావిప్లవం రెండవదశకు అంటే చైనాలో సోషలిస్టుసమాజనిర్మాణానికి, అభివృద్ధి చేయబడుతూంది.

ఇది చైనా విప్లవ ప్రస్తుతదశయొక్క అతిముఖ్యమైన ప్రత్యేకత. ఈ కొత్త విప్లవం 1919 మే 4 విద్యార్థి ఉద్యమం నుంచి 1940 వరకూ గడచిన ఇరవైయేళ్ళలోనూ నడచిన మార్గం యిదే. ఇదేనేటి చైనా విప్లవంయొక్క సజీవమైన స్వరూపం.

# బూర్జువావర్గం, శ్రామికవర్గం - వీటి పాత్ర

చైనా విప్లవం రెండుదశల్లో నడుస్తుందనీ అందులో మొదటిదశయైన "నూతన ప్రజాస్వామికం" చైనా విప్లవ చరిత్రకొక కొత్త ప్రత్యేకతఅనీ తెలుసుకున్నాం. అయితే చైనాయొక్క ఆంతరంగిక ఆర్థిక రాజకీయ సంబంధాలమధ్య ఈప్రత్యేకతయొక్క స్వరూప, స్వభావ పరిణామాలెలా ఉంటాయి?

మొదటి సామ్రాజ్యవాద యుద్ధమూ రష్యన్ విప్లవమూ జరిగింతరవాత వచ్చిన 1919 "మే 4" ఉద్యమానికి పూర్వం చైనా బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి విద్యాధికులైన బూర్జువా, పెట్టీ బూర్జువా వర్గాలే రాజకీయ నాయకత్వం వహించారు. అప్పటికింకా చైనా శ్రామికవర్గం, చైతన్య

ఎంతమైన స్వతంత్రశక్తిగా వ్యవహరించగలిగిన స్థితిలోకి రాలేదు. కాబట్టి విప్లవంలో బూర్జువా, పెట్టీ బూర్జువాల నాయకత్వం క్రిందనే పనిచేసింది. 1911 లో చైనా శ్రామికులంతే చేశారు.

కాని "మే 4" ఉద్యమం తరవాత చైనా ప్రజాస్వామిక విప్లవంయొక్క రాజకీయ నాయకత్వ బాధ్యత పూర్తిగా బూర్జువా, పెట్టీ బూర్జువాల పైనేగాక, శ్రామిక వర్గంపైనకూడా నిలిచింది. ఆనాటి శ్రామికవర్గం తాను స్వయంగా అభివృద్ధి అవడంమూలంగానూ రష్యన్ విప్లవ ప్రభావం దానిపై బడడంమూలంగానూ బహు త్వరగా ఒక చైతన్యయుతమైన స్వతంత్ర శక్తిగా తయారైంది. చైనా కమ్యూనిస్టుపార్టీ "సామ్రాజ్యవాదం నశించాలి"అని నినాదమిచ్చింది; ఖచ్చితమైన సామ్రాజ్య వ్యతిరేక కార్యక్రమాన్నిచ్చింది. తరవాత కొంతకాలానికి భూమిపంపక విధానంలో విప్లవంకూడా పూర్తిగా కమ్యూనిస్టుల చొరవవల్లనే సాగింది.

చైనాబూర్జువాలు, వలస దేశ బూర్జువాలు, సామ్రాజ్యవాద నిర్బంధంవల్ల పీడింపబడుతూంటారు. అందువల్ల సామ్రాజ్యవాద యుగంలో, విదేశ సామ్రాజ్యవాదమన్నా యుద్ధప్రేరేపకులైన సేనాపతి సామంతులన్నా, తమపరిస్థితుల ననుసరించి కొంతవరకు తిరుగబడే స్వభావం కలిగి ఉంటారు. అందువల్ల వారికీ శ్రామికులకూ, మధ్యతరగతులకూ, పొత్తు కుదరటానికి వీలున్నది. చైనాబూర్జువాలకు శత్రువులైన వారిపైన కలసిపోరాడటానికి అవకాశం యేర్పడుతుంది. 1911 విప్లవసమయంలోనూ, నాంకింగ్‌పై దండయాత్ర సమ

యంలోనూ, అంటే బూర్జువాలకు ప్రభుత్వాధికారం రాక పూర్వం యిలాంటి పొత్తే కుదిరింది.

ఇదే చైనా బూర్జువాలకూ, రష్యన్ బూర్జువాలకూ భేదం. జారుప్రభుత్వం క్షీణిస్తున్న భూస్వామ్య విధానపు సైనికప్రభుత్వం, పరదేశాలను జయించడానికి దండయాత్రలు చేసింది. బూర్జువాలందులో పాల్గొన్నారు. కాబట్టి రష్యన్ బూర్జువాలలో విప్లవతత్వం లేకుండాపోయింది. అందువల్ల ఆ శ్రామికవర్గం, ఆ బూర్జువాలను ఎదుర్కోవలసివచ్చింది. వారితో చేతులుకలిపే అవకాశం లేకుండాపోయింది. ఇక్కడ చైనాలో బూర్జువాలు పరిస్థితులనుబట్టి కొంతవరకు విప్లవ తత్వం కలిగి ఉన్నారు. కాబట్టి సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించడంలోనూ, యుద్ధప్రేరేపకులైన సైనికసామంతులను ఎదుర్కోడంలోనూ చైనా బూర్జువాలతో ఐక్య సంఘటన సాధ్యపడుతుంది. శ్రామికవర్గం దీన్ని విస్మరింపజాలదు.

అయితే ఈ వలస దేశ లక్షణాలను బట్టే అసలు పోరాటానికి వచ్చేప్పటికి చైనా బూర్జువాలకో బలహీనత కూడా ఉంది. ఆర్థికంగానూ రాజకీయంగానూ బలహీనులవడంచేత విప్లవానికి శత్రువులైన వారితో రాజీ పడాలనే మరోధోరణి కూడా వారిలో ఉంది.

చైనా బూర్జువాలకు, ముఖ్యంగా పెద్ద బూర్జువాలకు, మనతో కలిసి ఉన్నప్పుడు కూడా సామ్రాజ్యవాదంతో రహస్యంగా [illegible] చేసుకోడానికి యిష్టమున్నది. వారికింకా పల్లెపట్టుల్లో జమీందార్ దోపిడీతో సన్నిహిత సంబంధమున్నది. కాబట్టి సామ్రాజ్య వాదాన్ని పూర్తిగా కూలదోయటానికి నిర్ణయం తీసుకోజాలరు. భూస్వామ్య శక్తు

లను అసలేకూలద్రోయలేరు. ఈకారణం వల్ల చైనా బూర్జువా ప్రజాస్వామిక విప్లవం యొక్క ముఖ్య సమస్యలను రెంటని గూడ పరిష్కరించ లేక పోయినారు. 1927-36 మధ్య కాలంలో వీరు విప్లవ పంథాను దిగనాడి, సామ్రాజ్య వాదం యొక్క కౌగిలిలో చేరారు. జమీందారీ శక్తులతో చేతులు కలిపారు. విప్లవ ప్రజాసామాన్యానికిద్రోహం చేశారు.

నేడు గూడా, యీ జపానువ్యతిరేకయుద్ధంలో చైనా బూర్జువాలముతా ఒకటి(వాంచింగ్-వీ ఇంకా అలాంటిలొంగు బాటుదారులూ) మరోమారు ద్రోహంచేసింది. చైనా బూర్జు వాలకున్నూ, అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీదేశాల బూర్జు వాలకూ, ముఖ్యంగా యింగ్లండు అమెరికా బూర్జువాలకూ, యిదే భేదం. పోల్చి చెప్పాలంటే యిగ్లండు అమెరికా బూర్జువాలు వారి వారి బూర్జువా ప్రజాస్వామిక విప్లవ సమయాల్లో కలిగియుండిన విప్లవస్థిరత్వం చైనా బూర్జువాలకు లేదు. కాబట్టి చైనా బూర్జువాలతత్వం రెండు విధాలగా ఉంటుంది. ఒక వేపున విప్లవతత్వం రెండో వేపున రాజీతత్వం.

ఇదీ చైనా బూర్జువాల ద్వంద్వస్వభావం. ఈ ద్వంద్వ స్వభావం మూలంగా చైనా బూర్జువాలు, ఒకప్పుడు యూరప్ అమెరికా బూర్జువాలు నిర్వహించిన విప్లవపాత్రనుగూడా నిర్వహించలేక పోతున్నారు. వారు బలవంతులైన శత్రు వులతో పోరాడవలసివచ్చినప్పుడు కార్మిక కర్షకులతో పొత్తు చేరతా మంటారు. కాని కార్మిక కర్షకులు రాజకీయ చైత న్యాన్ని పొందినప్పుడు, వారిఁణచడానికి మరల శత్రువులతో చేతులు గలుపుతారు. యిది ప్రపంచమంతటా బూర్జువాలకు సర్వ సాధారణమైన లక్షణం. అయితే మనం గమనించా

ల్సిందేమంటే, మనచైనా బూర్జువాలకు యీ లక్షణాలు అతిగా ఉన్నై.

చైనాలో మనకో విషయం సులభంగా అవుపడుతుంది. సామ్రాజ్యవాదాన్నీ, జమీందారీ విధానాన్నీ పడదోయడంలో నిజంగా నాయకత్వం వహించగలవారిని ప్రజలు విశ్వసిస్తారు. కారణమేమంటే సామ్రాజ్యవాదమూ, జమీందారీ విధానమూ రెండూ ప్రజలకు ముఖ్యశత్రువులు. ఈ రోజు జపాను సామ్రాజ్యవాదాన్ని జయించి, ప్రజాస్వామిక పరిపాలనను అమలుపరచగల వారిని, ప్రజలు తమ రక్షకులుగా పరిగణిస్తారు. చైనా బూర్జువాలే యీ కార్యం నిర్వహించగలిగితే నిజంగా యెంతో ప్రశంసా పాత్రులౌతారు. లేకపోతే యీ కార్యభారం చైనా శ్రామికవర్గం యొక్క భుజస్కంధాలపైన బడుతుంది.

ఏది యెలా ఉన్నప్పటికీ, చైనాకార్మికులూ, కర్షకులూ, విద్యార్థులూ, యితర మధ్యతరగతులూ వీరే ముఖ్య శక్తులు. వీరిపైనే చైనాగతులు ఆధారపడి ఉన్నవి. ఈ వర్గాలవారు చైతన్యవంతులైనారు: అవుతున్నారు. తప్పకుండా రాబోయే చైనా ప్రజాస్వామిక ప్రభుత్వానికి, అంటే సామ్రాజ్యవాదానికీ, జామీందారీ విధానానానికీ వ్యతిరేకులైన ప్రజావర్గాలన్నిటియొక్క నియంతృత్వరూపమైన "నూతనప్రజాస్వామిక" ప్రభుత్వయంత్రానికి ముఖ్యాంగాలుగా, పునాదిగా ఉండబోతారు. మరో విధంగా చెప్పాలంటే డాక్టరు సన్-యట్-సేన్ సూచించిన" మూడు సూత్రాలూ, ఆయన సూచించిన నిజమైన విప్లవపంథాలో, ఆచరణలో పెట్టే ప్రజాస్వామికానికి పునాదులుగా ఉండ

బోతాయి. "సోవియట్ రష్యాతో ఐక్యత, కమ్యూనిస్టులతో ఐక్యత, కార్మికకర్షకుల ప్రయోజనాలను కాపాడటం" యీ మూడు సూత్రాలూ చైనాకు సన్-యట్-సేన్ ఇచ్చిన మహోత్కృష్ట రాజకీయ సాంప్రదాయం. ఈ సాంప్రదాయంలో నిర్మింపబడే ప్రజాస్వామికానికి పైనజెప్పిన విప్లవ ప్రజావర్గాలు పునాదులుగా ఉండబోతారు.

"అనూతన ప్రజాస్వామిక" ప్రభుత్వం పాశ్చాత్య దేశాల పూర్వపుపద్ధతి ప్రజాస్వామికాలలాంటిదికాదు. వాటికి కాలదోషం పట్టింది. కాక, సోవియట్ శ్రామికనియంతృత్వమైన సరికొత్త సోషలిస్టుప్రజాస్వామికమూ, అంటే, అదీ గాదు. అలాంటిప్రభుత్వమే అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలన్నిటిలోనూ స్థాపింపబడుతుంది. కాని వలస దేశాల్లోనూ కొంతవరకూ వలసలక్షణాలుగల "స్వతంత్ర" దేశాలలోనూ. యిలాంటి సరికొత్త సోషలిస్టుప్రభుత్వం ఆచరణసాధ్యం కాదు. కాబట్టి విప్లవోద్యమాలు నడుస్తూన్న వలస దేశాలలోనూ. కొంతివలసలక్షణాలుగల దేశాలలోనూ, ఒకానొక చారిత్రక కాలంలో, మూడోవిధమైన ప్రజాస్వామికమే అంటే "నూతనప్రజాస్వామికమే" నెలకొల్పబడుతుంది. ఒకానొక చారిత్రక కాలానికి అనుగుణమైన ప్రభుత్వం అనటంచేత అది తాత్కాలికస్వరూపమనే అర్థంచేసుకోవాలి. అయినప్పటికీ ఆకాలానికీ, ఆపరిస్థితులకూ. తప్పనిసరియైన ప్రభుత్వం అదే అవుతుంది.

# "నూతన ప్రజాస్వామిక" ప్రభుత్వము

ప్రపంచంలో ఉన్న ప్రభుత్వాలను వాటి సామాజిక స్వభావాన్నిబట్టి మూడు విధాలుగా భాగించవచ్చును.

1. బూర్జువా నియంతృకమైన ప్రజాస్వామికము.
2. శ్రామిక నియంతృకమైన ప్రజాస్వామికము.
3. అనేకవర్గాల సంయుక్త నియంతృకమైన ప్రజాస్వామికము.

మొదటిది పాతనాటి ప్రజాస్వామిక దేశాల్లో అంటే ఇంగ్లండు, అమెరికా దేశాల్లో ఉంది.

రెండోది ప్రస్తుతం సోవియట్‌యూనియన్‌లో ఉంది. అభివృద్ధిజెందిన పెట్టుబడిదారీ దేశాలు కొంతకాలానికి దీన్నే అవలంభించుతాయి.

మూడోది విప్లవయుతమైన వలసదేశాలూ, కొంత వలసలక్షణాలుగల దేశాలూ పరిణామకాలంలో అవలంబించే ప్రభుత్వముయొక్క స్వరూపం.

ఆ యా వలసదేశాలకు ప్రత్యేక లక్షణాలుండవచ్చును. కాని ప్రభుత్వ పరిపాలనా పద్ధతులు, సుమారు ఒకేరకంగా ఉంటాయి. అంటే, సామ్రాజ్యవాద వ్యతిరేక వర్గాలన్నిటియొక్క సంయుక్త నియంతృక పద్ధతులలో నడిచే నూతన ప్రజాస్వామిక ప్రభుత్వమన్నమాట.

ఈ విధమైన ప్రభుత్వం నేటి చైనాలో జపాను వ్యతిరేక ఐక్య సంఘటనారూపంగా ఉంటుంది. అది జపాను వ్యతి

రేకమూ, సామ్రాజ్యవాద వ్యతిరేకమూ గాబట్టి విప్లవ వర్గాలన్నిటియొక్క ఐక్య సంఘటనా నియంతృత్వంగా ఉంటుంది.

యుద్ధం ఇన్నేళ్ళు నడిచింతరవాత దేశంలో ప్రజాతంత్రం ప్రవేశ పెట్టవలసిన కార్యక్రమం పూర్తి గాకుండా ఉండటే మనజాతికి ఎంతో అపాయకరం. మనలను ఎప్పుడూ పడగొట్టాలని చూసే జపానుకు మనం ఎక్కడెక్కడ బల హీనంగా ఉన్నామో ఎత్తిచూపినట్లవుతుంది. ప్రజాతంత్రం ప్రవేశ పెట్టడానికి నడిపే ఉద్యమం ద్వారా ఈ మధ్య పుట్టుకొచ్చిన పరిస్థితులను దాటగలమని ఆశిస్తున్నాం.

ప్రభుత్వం యెలాంటిదుండాలి? అనేసమస్య 'మంచూ' చక్రవర్తుల కాలంనుంచీ ఉంది. అసలీ సమస్య కర్థంఏమిటి అంటే, సమాజంలో వివిధ వర్గాల మధ్య ఉండే సంబంధాలెలా ఉండాలి? అందులో ఏ ఒక్కవర్గమూ నియంతృత్వ అధికారం వహించడానికి వీల్లేకుండా వర్గసంబంధాలను సమన్వయపరచడం ఎలాగూ? అని.

ఇక్కడో విషయం చెప్పాలి. బూర్జువాలు సర్వనియంతృత్వాధికారాన్ని వహించడానికి ప్రజా సామాన్యాన్ని మోసం చేస్తారు. ఒక వర్గంయొక్క అంటే తమ బూర్జువా వర్గం యొక్క ప్రాబల్యాన్ని కప్పి పుచ్చుకోడానికి ప్రజలందరికీ 'పౌరులు' (Citizens) అని పేరుపెట్టారు. అసలు ప్రజలను పౌరులంటం రైటే, కాని ఎప్పుడు? విప్లవ వ్యతిరేకులనూ, ద్రోహులనూ మినహాయించినప్పుడు; వీరిపైన విప్లవ వర్గాలూ ప్రజానీకమూ సంయుక్తనియంతృత్వ చెలాయించినప్పుడూను.

1924 లో జరిగిన అఖిల చైనా కొమింటాంగు ప్రతినిధి మహాసభ యేమని ఉద్ఘోషించిందో చూద్దాం. "కొన్ని

దేశాల్లో ప్రజాస్వామ్య పద్ధతిని బూర్జువాలు దుర్వినియోగం చేశారు. అందువల్ల ప్రభుత్వ యంత్రం ప్రజలను నిర్బంధించే యంత్రంగా మారిపోయింది కొమింటాంగు ప్రకటించిన ప్రజా ప్రభుత్వ సూత్రానికి మాత్రం ప్రజలు ప్రభుత్వాన్ని నిర్వహిస్తారని అర్థం; అంతేకాని కొద్దిమంది ప్రత్యేక వ్యక్తులు చెలాయిస్తారని గాదు.”

గడచిన పదహారేళ్ళలోనూ కొమింటాంగు యీ సూత్రాన్ని పాటించక, జాతీయవినాశకర దుర్ఘటనలకు అనేకానికి కారణమైంది. ఈమహాపరాధాన్ని యీయుద్ధపు ఒత్తిడివల్లనైనా సరిదిద్దుకుంటుందని ఆశిస్తున్నాం.

ప్రభుత్వమెలావుండాలనే సమస్యకొద్దాం.

‘పరిపాలన’ అంటే ఒకవర్గం తనశత్రువులనుంచి తనసురక్షించుకుంటానికని నిర్మించే ప్రభుత్వ వ్యవస్థ లేక నిర్మాణం. ఒక ఖచ్చితమైన పరిపాలనావిధానం లేకపోతే అసలు ప్రభుత్వమనేది ఉంటానికి వీలేలేదు. *

---

* గవర్న్మెంటు = పరిపాలన: అంటే సమాజంయొక్క ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ వ్యవహారాలు యిలాఉండాలి అని నిర్ణయించే వ్యవస్థ లేక సంస్థ.

స్టేటు = ప్రభుత్వం, అంటే సమాజంయొక్క ఆర్థిక, సాంఘిక రాజకీయ వ్యవహారాలను ఒకవర్గం, లేక కొన్నివర్గాలు, తమ ప్రయోజనాలకనుగుణ్యంగా నడుపుకోవాలనే ఉద్దేశంతో నిర్మించే నిర్బంధవిధానయంత్రం.

ప్రభుత్వం ఏవర్గంచేతుల్లో ఉంటుందో పరిపాలనావిధానం ఆవర్గానికి అనుకూలంగా ఉంటుంది. పెట్టుబడిదారీ ప్రభుత్వము, పెట్టుబడిదారులకు, గాక మిగిలిన సమాజమంతటి యొక్క ప్రయోజనాలకు వ్యతిరేకం. శ్రామిక ప్రభుత్వం పెట్టుబడి దారులకుగాక మిగిలిన సమాజాని కంతటికీ అనుకూలం. నిస్వవర్గాల సంయుక్త ప్రభుత్వం తాత్కాలిక చారిత్రక పరిస్థితుల్లో సమాజ విరోధులకు తప్ప, మిగిలినసమాజాని కంతటికీ అనుకూలం.” అనువాదకుడు

ఇక్కడ మనఉద్దేశం ఏమంటే, చైనాపరిపాలకవర్గం జాతీయ మహాసభలచేత ఎన్నుకోబడాలి. అంతేకాక జాతి మతభేదాలు, స్త్రీపురుషభేదాలూ, ఆస్తి హెచ్చుతగ్గులూ, విద్యాధిక్యతా, న్యూనతలూ, పాటించకుండా ప్రజలందరికీ ఓటింగుహక్కు ఉన్నపుడే విప్లవవర్గాలకు తగినంత ప్రాతినిధ్యం రాగలదు. ప్రజాభిప్రాయం సంపూర్ణంగా వెల్లడికాగలదు. విప్లవపోరాటం సరిగా నడపబడగలదు. "నూతనప్రజాస్వామికం" భావంలోనూ, ఆచరణలోనూ సాధించబడగలదు. ఈపరిపాలనావిధానాన్ని "కేంద్రీకృతప్రజాస్వామిక" విధానం అంటారు. కేంద్రీకృత ప్రజాస్వామికసూత్రం పైన ఆధారపడిన పరిపాలనయే విప్లవ ప్రజాభిప్రాయాన్ని సంపూర్ణంగా ప్రకటించ గలదు. శత్రువులనుండి బాగా రక్షించుకొనగలదు.

పరిపాలనా విధానంలోనూ, సైన్యనిర్మాణంలోనూ స్వార్థపరులకు తావుండరాదు. ఈ సూత్రం నిజమైన ప్రజాప్రభుత్వానికి జీవగర్రగా ఉండాలి, లేకపోతే పరిపాలనా విధానానికీ, ప్రభుత్వయంత్రానికీ వైరుధ్యం యేర్పడుతుంది.

ప్రభుత్వయంత్రం విప్లవవర్గాలన్నిటియొక్క నియంతృత్వమనీ, పరిపాలనావిధానం కేంద్రీకృత ప్రజాస్వామికమనీ చెప్తూన్న సిద్ధాంతమే "నూతన ప్రజాస్వామికా"నికి రాజకీయ పునాది. దీనినే మనం రిపబ్లికు లేక పజాప్రతినిధి ప్రభుత్వం అంటాము. ఈ రిపబ్లికులేక ప్రజా ప్రతినిధిప్రభుత్వం నూతన ప్రజాస్వామిక విధానంపైనా -సన్ యొక్క "మూడు ప్రజా సూత్రాల్పైనా" ఆధారపడి ఉంటుంది. ఇలాంటిచైనా రిపబ్లిక్ నే —పై పేరుకేకాకుండా ఆచరణలోగూడా – నిజమైన చైనారిపబ్లికునే మనం నిర్మించ వలసిఉంది.

జపాన్ వ్యతిరేక విప్లవచైనాలో యిలాంటి అంతరంగిక రాజకీయ సంబంధాలనే ఏర్పరచాలి. ఈవిధానం అనుసరిస్తేనే మన ప్రస్తుత బాధ్యతలను నిర్వర్తించిన వాళ్ళమౌతాం.

పైన జెప్పినలాంటి రిపబ్లిక్‌లో రాజకీయాలెలాగైతే "నూతన ప్రజాస్వామిక" రాజకీయాలో, అలాగేఆర్థిక విధానంగూడా "నూతన ప్రజాస్వామిక" ఆర్థిక విధానంగానే ఉండాలి.

పెద్దబ్యాంకులూ, పెద్దపరిశ్రమ, పెద్దపెద్దవ్యాపారాలూ సంస్థలూ, ప్రభుత్వ యాజమాన్యంకింద ఉండాలి. ప్రజలజీవనం స్వార్థపరుల బాధలేకుండా నిరాటంకంగా సాగడానికి, ప్రైవేటు మేనేజిమెంటు చేతులకు అరపనటువంటివన్నీ, మిరాశీ సంస్థలైనటువంటివన్నీ బ్యాంకులూ, రైల్వేలూ, విమాన మార్గాలూ, మొదలైనవాటిని, ప్రభుత్వమే అజమాయిషీ చేస్తుందీ; కంట్రోలు చేస్తుంది. పెట్టుబడిని కంట్రోలుచేయాలనే సిద్ధాంతంయొక్క ముఖ్యసంగ్రహమిదే. మొదటి అఖిల చైనా ప్రతినిధుల మహాసభకూడా యిదే ఉద్ఘోషించింది. నూతన ప్రజాస్వామిక ప్రభుత్వంయొక్క ఆర్థికపునాదిని వేయటానికి యిదే సరియైన మార్గం

అయినా, యీమధ్య కాలంలో ప్రభుత్వం మిగతా విధాలుగా ఉన్న ప్రైవేటు ఆస్తిని వశపర్చుకోటంగానీ, పెట్టుబడిదారీ ఉత్పత్తిని అరికట్టడంగానీ జరగదు. అయితే షరతు ఏమంటే, ఆప్రైవేటు ఆస్తీ, ఉత్పత్తి, ప్రజా జీవనానికి నష్టకరంగా ఉండకూడదు. ఈవిధానం అవలంబించడానికి కారణమేమంటే చైనా ఆర్థికవిధానం యింకా వెనకబడి ఉండటమే.

పెద్ద భూస్వాముల భూమిని వశంచేసుకుని పొలంలేని రైతులకూ, ఉన్నా చాలని రైతులకూ, పంచిపెట్టడానికి నూతన ప్రజా ప్రభుత్వం చర్యతీసుకుంటుంది. "దున్నే వాడిదేభూమి" అన్న డాక్టరు సన్-యట్-సేను భావాన్ని ఆచరణలో పెట్టాలి. పల్లెటిప్రాంతాల జమీందారీ విధానాన్నీ జమిందారీ సంబంధాలను తెంచివెయ్యాలి. భూమి రైతుల స్వంత ఆస్తిగావటానికి వీలుగా యాజమాన్య హక్కులను మార్చి వెయ్యాలి. అంతేగాని సోషలిస్టు వ్యవసాయ విధానాన్ని నిర్మించే ఉద్దేశం ప్రస్తుతం పనికిరాదు. ధనిక రైతులు గూడా ఉండవచ్చు. ఈ పంథాను ఆచరణలో పెట్టేటప్పుడు యివ్వవలసిన సరియైన నినాదమేమంటే "దున్నే వాడిదే భూమి." అని.

చైనా ఆర్థిక విధానం. "పెట్టుబడిని కంట్రోలు చేయాలి" "భూమిపై సమాజయాజమాన్యహక్కు ఉండాలి" అనే సూత్రాలపైన నడవాలి. కొద్దిమంది స్వార్థపరుల చేతుల్లో ఉండగూడదు. అలా స్వార్థపరుల చేతుల్లో ఉండే ఆర్థికవిధానం ప్రజా జీవనాన్ని నాశనం చేస్తుంది. మన ఆర్థిక విధానం పాశ్చాత్య పెట్టుబడిదారీ సమాజాల ఫక్కీలో నిర్మింపబడగూడదు. పాతబడి క్షీణిస్తూన్న జమీందారీ విధానపు భూసంబంధాలను అలాగే అట్టిపెట్టగూడదు. పైన జెప్పిన నూతన జాతీయఆర్థికవిధానానికి వ్యతిరేకమైన విధానాన్ని నిర్మించ సాహసించేవారు తప్పకుండా విఫలు లౌతారు. సాధ్యంకానిది చేయబోయి బోర్లపడతారు. ఇదే జపాను వ్యతిరేక విప్లవ చైనా తప్పకుండా నిర్మించ వలసిన ఆంతరంగిక ఆర్థిక విధానం. యిలాంటి ఆర్థిక విధానమే

నూతన ప్రజాస్వామిక ఆర్థిక విధానము. ఈ నూతన ప్రజాస్వామికం యొక్క రాజకీయాలు ఈ నూతన ఆర్థిక విధానానికి సమగ్రమైన ప్రతిబింబమే!

# నూతనజాతీయ - అంతర్జాతీయ పరిస్థితులు

నూతన ప్రజాస్వామిక రాజకీయాలూ ఆర్థికవిధానమూ కలిగిన యీ ప్రజాప్రతినిధి ప్రభుత్వం నూటికి తొంభై మంది చైనా ప్రజల కోరికలకనుకూలంగా ఉంటుంది. అలాంటి ప్రభుత్వం "మానవ కాంక్షితానికీ చారిత్రకాభివృద్ధికీ, ప్రజల అవసరాలకూ అనుగుణ్యంగా ఉంటుంది. దాని కొరకు ప్రజలందరూ పోరాడడానికి ఉద్యుక్తులైయుంటారు కాబట్టి అలాంటి ప్రభుత్వం తప్పకుండా నిర్మింపబడుతుంది." ఇవి ఒకప్పుడు డాక్టరు సన్ యట్ సేను ఎంతో దూరదృష్టితో అన్నమాటలు. చైనా విముక్తికి యిదిఒక్కటే మార్గం.

ఇందులో కొంతమంది బూర్జువా నియంతృత్వ ప్రభుత్వంగల పాశ్చాత్య పెట్టుబడిదారీ సమాజాలను అనుసరించాలని సూచింమతున్నారు, అంటే తప్పకుండా సూచించవచ్చును. వాళ్ళు చెప్పేదారి ఒకప్పుడు పాశ్చాత్య బూర్జువాలు నడిచిందే కాని చైనా మాత్రం సరిగ్గాఅలాంటి మార్గాన్నే అనుసరించడం అసంభవం. ఎందుకంటే జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు మారినవి.

మొట్టమొదల లాంటిది అంతర్జాతీయ పరిస్థితులనుబట్టి అసంభవం. నేటి అంతర్జాతీయ పరిస్థితులయొక్క ప్రముఖ లక్షణం ఏమంటే క్షీణిస్తూన్న సామ్రాజ్యవాదానికీ, అభ్యుదయసోషలిజానికీ ఘర్షణ జరుగుతూంది. కాబట్టి క్షీణిస్తూన్న సామ్రాజ్యవాదం చైనాలో పెట్టుబడిదారీ విధానాన్ని అభివృద్ధి కానీయజాలదు, అరికట్టుతుంది.

చైనా దేశపు ఆధునిక చరిత్ర అంతా సామ్రాజ్యవాదం చైనాపై చేసిన దండయాత్రల చరిత్రే; చైనాస్వాతంత్ర్యాన్నీ, చైనాయొక్క పెట్టుబడిదారీ విధాన అభివృద్ధినీ అరికట్టిన చరిత్రే. ఇంతకుక్రితం జరిగిన చైనావిప్లవ సన్నాహాలన్నీ వేలకొలది దేశభక్తులు బలియై పోయిన ఆ ప్రయత్నాలన్నీ సామ్రాజ్యవాదం చేత అణచివేయబడ్డవి. ఇప్పుడు బలిష్ఠమూ, క్రూరమూ, ఐన జపాను దురాక్రమణచేసే ఉద్దేశంతో చైనాపైన దండయాత్ర చేసింది. చైనాలో చైనాపెట్టుబడిదారీ విధానాన్ని అరికట్టి తన పెట్టుబడిదారీవిధానాన్ని అభివృదిచేసుకోడానికే జపాను శాయశక్తులా ప్రయత్నిస్తూంది. చైనాలో బూర్జువా నియంతృత్వాన్ని అరికట్టి తన బూర్జువా నియంతృత్వాన్ని స్థాపింపబూనుకున్నది.

నిజంగా యీరోజున సామ్రాజ్యవాదం చావుకు వెరచి పోరాడుతూంది., చావుకుసిద్ధమైంది; ఒకప్పుడు లెనిన్ చెప్పినట్లు, "పెట్టుబడిదారీవిధానంయొక్క అంతిమదశయే సామ్రాజ్యవాదం." అయితే చావు దాపరిస్తున్నది గనుకనే వలస దేశాలపైనా, బానిస దేశాలపైనా బడి పీక్కుతింటం విపరీతమైంది. అందువల్ల ఆదేశాల్లో పెట్టుబడిదారీ సమాజాన్ని అభివృద్ధి కానీయటంగాని, మరో బూర్జువా నియంతృక

మైన ప్రభుత్వాన్ని నెలకొల్పనీయటంగాని జరగదు. జపాను సామ్రాజ్య వాదంగూడా తీవ్రమైన ఆర్థిక రాజకీయ సంక్షోభంలో చిక్కుకొని చావుకు సిద్ధమైంది. అందుకే చైనాపై దండయాత్ర చేసింది. చైనాలో వలస రాజ్యాన్ని స్థాపన చేయాలని పూనుకుంది. చైనా బూర్జువా నియంతృత్వ స్థాపననూ, జాతీయ పెట్టుబడిదారీ విధానాభివృద్ధినీ అరికట్టాలని పూనుకుంది.

మరో వేపున సోషలిజం అభివృద్ధి చెందుతూంది. సోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్ యొక్క అంతర్జాతీయ శ్రామిక వర్గము యొక్క సహాయాన్ని స్వాతంత్రం కొరకు పోరాడే చైనా తప్పకుండా పొందాలి. మరో విధంగా చెప్పాలంటే, చైనా పెట్టుబడిదారీ విధానాభివృద్ధి మార్గాన్ని జపాను, బ్రిటను, అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ మొదలైన దేశాల్లోని శ్రామికవర్గం యొక్క పోరాటాలనుంచీ, తద్విజయ మార్గాలనుంచీ వేరు చేయడానికి వీల్లేదు. వాళ్ళ విజయమే మన జయము; చైనా విజయము. ప్రత్యేకంగా ఈ దేశంలోనో, ఆ దేశంలోనో విప్లవం జయించిం తరవాత వస్తుందని జోస్యం చెప్పడానికి వీల్లేక పోయినా, ఒక్కటి మాత్రం సత్యం; ఆ దేశాల సహాయం వల్లనే చైనాకు విజయం చేకూరగలదు. సోవియట్ యూనియన్ స్నేహపూర్వకంగా చేజాచి ఆహ్వానిస్తూంది. అలాంటి స్నేహాన్ని జారవిడిచామా అంటే జపాను పైన మనం సాగిస్తూన్న యీ ఆత్మరక్షణ యుద్ధంలో అంతిమ విజయాన్ని పొందలేము. సోవియట్ యూనియన్ సహాయాన్ని నిరాకరించామా, మన విప్లవం వినాశనంగాక తప్పదు. 1927 తరవాత సాగించిన

సోవియట్ వ్యతిరేక ప్రచార దుష్ఫలితాలను ఒక్కమారు తలుచుకుంటే సోవియట్ యొక్క స్నేహం, సహాయం ఎంత అవసరమో తెలుస్తుంది.

ఇది విప్లవయుగం; యుద్ధయుగం పెట్టుబడిదారీ విధానానికి తప్పించుకోరాని మృత్యుయుగం. అలాంటి యీ యుగంలో, జమీందారీ విధానాన్నీ, సామ్రాజ్యవాదాన్నీ జయించింతరవాత, బూర్జువానియంతృకమైన పెట్టుబడిదారీ సమాజాన్ని నిర్మించ గలమనుకోటం వట్టిభ్రమ.

మొదటి సామ్రాజ్యవాదయుద్ధమూ నవంబరువిప్లవమూ ముగిసిం తరవాత, టర్కీలో ప్రత్యేక పరిస్థితులేర్పడినవి. అంటే గ్రీసుపైన విజయంపొందిన టర్కీబూర్జువాలు బలపడ్డారు. వాళ్ళతో పోల్చి చూచుకుంటే శ్రామికవర్గం అంత బలంగాలేదు. అందువల్ల బూర్జువా నియంతృత్వం నెలకొల్పబడటానికి వీలుకలిగింది. ఇప్పుడు యీ యుద్ధం అంతంఅయింతరవాత. సోషలిజం విజయం పొందినతరవాత టర్కీలో నాలుగుకోట్ల టర్కీప్రజలయొక్క నూతన ప్రజాస్వామికము నెలకొల్పబడి తీరుతుంది. చైనాలో ప్రత్యేక పరిస్థితులేర్పడ్డాయి. అంటే చైనాబూర్జువాల రాజీస్వభావమూ, శ్రామికవర్గంయొక్క బలాధిక్యత మూలకంగా, చైనాలో, టర్కీలో బూర్జువానియంతృత్వం నెలకొల్పడం అంతసులభంగాదు.

"చైనా బూర్జువాలు 1927 చైనావిప్లవంలో ఓడిపోయింతరువాత 'కెమాల్ పాషా పంథా కెమాల్ పాషా పంథా, అని కేకలు వేశారే! ఆ 'కెమాల్ పాషా పంథా' చైనాలో ఎక్కడుంది, చైనాలో బూర్జువా నియంతృకమైన చైనా సమాజంగానీ. దానికనుగుణమైన పెట్టుబడిదారీ

విధానంగానీ ఎక్కడున్నాయి? ఏమంటే నేటికా కెమాల్ పాషా టర్కీగూడా, దిగజారి, బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదాల కౌగిళ్ళలోపడ్డది. రోజురోజుకు వలస విధానం ఆక్రమించడంతో సామ్రాజ్యవాద, విప్లవనిరోధక ప్రపంచంలో భాగస్వామియై పోతున్నది. ఈ ఇరవైయ్యో శతాబ్దం. వల భయ్యోపడిలో యేర్పడ్డ అంతర్జాతీయ పరిస్థితుల్లో, వలస రాజ్యాల్లోనూ. వలసరాజ్యాల లక్షణాలున్నస్వతంత్ర దేశాల్లోనూ, "కెమాల్ పాషా పంథా" అమలు పరచాలని తెగకూసే, మొనగాళ్ళందరికీ రెండేరెండు మార్గాలున్నవి. 'సామ్రాజ్యవాద శిబిరంలోచేరి' ప్రపంచ విప్లవ వ్యతిరేకులై పోనన్నా పోవాలి; లేదా జపాను వ్యతిరేక శిబిరంలోకి వచ్చి ప్రపంచ పురోగమనంలో భాగస్వాములైనా కావాలి. ఇంక మూడో మార్గంలేదు.

చైనా బూర్జువాలు మన దేశ ఆంతరంగిక పరిస్థితుల నుంచి అనేక గుణపాఠాలు నేర్చుకొని ఉండవలసింది.

1927లో శ్రామికులూ, రైతులూ, మధ్యతరగతి బూర్జువాలూ కలసినందువల్ల విప్లవం జయంపొందింది. వెంటనే చైనా బూర్జువాలు ప్రజలను దిగదొక్కి, విప్లవఫలితాలను తామే మిరాశీగా అనుభవించాలని ప్రయత్నించారు. అప్పటినుండీ పదియేళ్ళు, కమ్యూనిస్టులను నాశనం చేయాలని దండయాత్రలు చేసిచేసి చతికిలబడ్డారు. ఫలితమేముంది?

అప్పుడే రెండేళ్ళయింది. యుద్ధం జరుగుతూండగానే జపాన్‌వాళ్ళు మన పవిత్ర దేశంలోకి చాలదూరం చొచ్చుకు వచ్చారు. ఇలాంటప్పుడు, పాశ్చాత్య బూర్జువా నియంతృత్వాలు సాగించిన పద్ధతులను, కాలదోషంపట్టి, కుళ్ళి, అసహ్య

మైనవాటిని యింకా కాపీచేయవలసిందేనా? పూర్వం మాదిరిగానే కమ్యూనిస్టులను నాశనం చేయడానికని దండయాత్రలు మరలసాగిస్తే ప్రయోజన ముంటుందనుకుంటున్నారా? అలాంటి దండయాత్రలు విఫలమవడమే గాకుండా, బూర్జువా నియంతృత్వ సిద్ధాంతమే సమూలంగా నాశనమైపోతుందని గ్రహించడంలేదా; నిజమే! పదేళ్ళ అంతర్యుద్ధానికి ఫలితంగా "ఏకపార్టీనియంతృత్వం" స్థాపించబడ్డది. కాని ఆ నియంతృత్వంయొక్క స్వభావం వలసదేశాల బూర్జువా నియంతృత్వాల స్వభావంగానే, క్షీణిస్తూన్న జమీందారీ విధాన స్వభావంగానే ఉంది.

అంతకన్నా అన్యాయం యేమంటే, 1927 నుంచి 1931 సెప్టెంబరు 18 ముక్డెన్ సంఘటనవరకూ చైనా బూర్జువాలు కమ్యూనిస్టులపై చేసిన దండయాత్రఫలితంగా జపాను మంచూరియాను వశపరచుకుంది. తరువాత ఆరేళ్ళ కమ్యూనిస్టు వ్యతిరేక దండయాత్రలఫలితంగా జపాను సైన్యాలు చైనా నడిగడ్డపైకే వచ్చిపడ్డాయి. మళ్ళీ "పదేళ్ళ అంతర్యుద్ధం" నడపాలనే వాడెవడన్నా ఉంటే' అటువంటివాడు కొత్తరకం కమ్యూనిస్టు వ్యతిరేకి అయిఉండాలి; కొన్ని లక్షణాల్లో పాత కమ్యూనిస్టు వ్యతిరేకులకూ, యీ కొత్తరకం కమ్యూనిస్టు వ్యతిరేకులకూ భేదముంటుంది.

ఈవరకే ఒకడీపాత్రను త్వరగా ధైర్యంచేసి పుచ్చుకున్నాడు. ఇతడు వాంగ్ – చింగ్ – వీ అనేవాడు. ఇతడు కొత్తరకపు కమ్యూనిస్టు వ్యతిరేక నాయకుడుగా ఘనతకెక్కాడు. ఈ వాంగ్ – చింగ్ – వీ తో చేరిపోవాలని ఉబలాట పడే వాళ్ళు మరికొంతమంది ఉండవచ్చును. కాని వాళ్ళకో బాధ

వుంది. అలా చేరిపోయింతరవాత "బూర్జువా నియంతృత్వము"నీ, "పెట్టుబడిదారీ సమాజము"నీ, "ఆధునిక ప్రభుత్వము"నీ, "ఏకపార్టీ నియంతృత్వము"నీ, "ఏకత్వ సిద్ధాంతము"నీ [అధ్యక్షతా, ప్రధానమంత్రిత్వమూ, సర్వసైన్యాధ్యక్షతా ఒకేవ్యక్తి చేతుల్లో ఉండాలనే సిద్ధాంతం] ఇలాంటి నినాదాలను ఏకరువుపెట్టే అవకాశం పోతుంది. ఆ దారికి కంపగొట్టటం జరిగింది. కాబట్టి వాంగ్ - చింగ్ - వీ పక్షాన ఉండవలసిన వాడెవడైనా జపాను వ్యతిరేక శక్తులతో కలిసి ఉండిగూడా ఆ జపాను వ్యతిరేక శక్తులనే తోసివేయాలనీ విజయఫలాన్ని మిరాశీగా హస్తగతం చేసుకోవాలనీ, ఏకపార్టీ నియంతృత్వం స్థాపించాలనీ, అనుకునే వాడుంటే, అట్టివాడు నిజంగా తన ముందు గతేమిటో కానలేకుంకా ఉన్నాడన్నమాట.

జపాన్ వ్యతిరేకయుద్ధం, కార్మికకర్షక విద్యార్థులకృపే గనక లేకపోతే, ఒక్క అడుగుకూడా ముందుకు సాగజాలదని మనమందరం స్పష్టంగా తెలుసుకోవాలి. జపాన్‌వాణ్ణి పారద్రోలాలని కోరేమనమే వెనక్కు పారదోలబడటం అవమానకరం. దురదృష్టవశాత్తు మనచైనాలో కరడుగట్టిన మొండి బూర్జువాలు గతఇరవైయేళ్ల గుణపాఠంలో వీసమైనా నేర్చుకోలేదు. ఇంకా 'కమ్యూనిస్టుల నరికట్టాల' నీ 'కమ్యూనిస్టులను వ్యతిరేకించాల' నీ అరుస్తూనే ఉన్నారు. వాళ్లుపూర్వం "ఎదిరిపార్టీని అరికట్టేచట్టం" [prevention of oppositionbill] ప్యాసుచేసి నడిపినతతంగానికి మరోఅధ్యాయం చేర్చుతూన్నారు. ఈవిధానంమూలంగా మన జాతియొక్కముందు గతేం

కానున్నదో మనకు తెలియనే తెలుసు. కాని వాళ్ల గతేం కానున్నదో వాళ్లకు తెలుసునాఅని మన అనుమానం.

"పెద్దలు! మీకో సలహా యివ్వదలచాం; దయచేసి కళ్లు తెరవండి. చైనా వేపు, ప్రపంచం వేపు ఒకమారు చూడండి. ప్రస్తుత జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను పరికించండి, మీరిదివరకు చేసిన పొరపాట్లను మళ్లీ చేయజాలరు. మీరు కళ్లు తెరవకపోతే జాతికి నష్టమేగాకుండా మీ వ్యాపారాలు గూడ సరిగాసాగవు" అని మనసారా ఒకసలహా యివ్వదలచాం. మాసలహాను తోసేసి యిదివరకు చేస్తున్న పనినే మళ్లీ సాగించదలిస్తే, కాలంగడిచినకొద్దీ తీరనిచిక్కుల్లోపడి, చివరకు ఆత్మ వినాశనంతో అంతమౌతారు. ఈ విషయాన్ని పరిస్థితులే ఖచ్చితంగా తేల్చివేశాయి. మేము యిన్నాళ్ళబట్టీ చైనా యొక్క జపాన్ వ్యతిరేక ఐక్యసంఘటన పరస్పరసహకారంతో విజయంచేకూరే వరకూని లుస్తుందని ఉవ్విళ్లూరాం. ఏ ఒక్కరో అధికారాన్ని హస్తగతం చేసుకోటంతో అంతంగాదని, ఆశిస్తూవచ్చాం. ఇదొక్కటేమార్గం, ఉత్తమోత్తమమైన మార్గం. కమ్యూనిస్టులం హృదయావేదనతో విజ్ఞప్తిచేస్తున్నాం. మామాలకాదనకండి." ఇది మనం యీ కరడుగట్టిన బూర్జువాలను కోరేది.

"ఏమాన్నావుంటే కలిసి తినండి" అన్నాడు చైనా రిపబ్లిక్ మొదటి అధ్యక్షుడైన లిన్-యు-హాన్. ఇందులో ఎంతో సత్యముంది. ఇప్పటిమాదిరే తోడుతోడుగా పోరాడుదాం, ఫలితాన్ని కలిసి అనుభవిద్దాం. చేయవలసిందేమన్నా ఉంటే తోడుతోడుగా చేద్దాం. నేర్చుకోవలసిందేమన్నా ఉంటే కలిసినేర్చుకుందాం. "ఒంటరిగా తిందామ" నే

మిరాసీ దృష్టి అసహ్యాకరం. అది జమిందారీ యజమానుల దృక్పథం. ఇరవైయ్యోశతాబ్దం నలభయ్యోపడిలో ఆచరణ యోగ్యంకాని దృక్పథం.

కమ్యూనిస్టులు తమకు వ్యతిరేకులుగానివారిని లొంగుబాటుకు వ్యతిరేకులైన వారినీ, విప్లవవాదులనూ కాదనరు. జపాను వ్యతిరేకులై ఐక్యసంఘటనను నిలువబెట్టాలని కోరే వివిధ వర్గాలూ, తరగతులూ, పార్టీలూ, రాజకీయమతాలూ, వ్యక్తులూ వీరందరితోటీ చివర దాకా సహకారం చేస్తారు. కాని కమ్యూనిస్టుపార్టీని తోసివేసి ఐక్య సంఘటనను భగ్నం చేయాలనే వారితోనే వస్తుంది చిక్కు. చైనా ఐక్యమై, పురోగమన పంథాలో నిలవాలి, పోరాడాలి. ఏ వేపునుంచి ఎవరు లొంగుబాటుకూ, చీలికకూ, వెనుక దిగబాటుకూ ప్రయత్నించినా కమ్యూనిస్టులు సంహించ జాలరు.

## సోషలిజానికింకా సమయంకాదు

ఒక ప్రశ్న అడగొచ్చు.

చైనా దేశం పెట్టుబడిదారీ విధానాన్ని బూర్జువా నియంతృత్వాన్ని అవలంబించడానికి వీల్లేకపోతే, సోషలిజాన్ని, శ్రామిక నియంతృత్వాన్నీ అనుసరించ కూడదా? అని. అలా వీల్లేదు

మనం యీరోజనుకునే విప్లవంయొక్క మొదటి దశ ఒకానొకనాటికి రెండోదశకు అంటే సోషలిజానికి తప్పకుండా మారుతుందనీ, సోషలిజంలోనే, చైనా సర్వసంపదలతో అలరారుతుందనీ వేఱే చెప్పనక్కరలేదు. కాని

ప్రస్తుతంమట్టుకు సోషలిజానికి సమయంకాదు. ప్రస్తుతవిప్లవం యొక్క బాధ్యతలు, సామ్రాజ్యవాద వ్యతిరేక కార్యక్రమం, జమీందారీ విధాన వ్యతిరేక కార్యక్రమం నెరవేరనిదే సోషలిజంయొక్క ప్రసక్తిరాకూడదు. చైనావిప్లవం రెండు దశల్లో సాధించబడకలదు. మొదటిది నూతన ప్రజాస్వామికం. రెండవది సోషలిజం. మొదటిదశ చాలకాలం పడుతుందని గుర్తుంచుకోవాలి. మనం ఆధ్యాత్మిక వాదులంగాము. ప్రస్తుత జీవితపరిస్థితులను మించిపోగలిగిన వాళ్లం గాము.

కొందరున్నారు, దుర్మార్గంగా ప్రచారం చేసేవాళ్లు. విప్లవంయొక్క రెండుదశలనూకలిపేసి, "ఒక్కఅడుగులోనే విప్లవంరావాలని" సిద్ధాంతాలువల్లిస్తారు. తద్వారా విప్లవాలన్నిటికీ "మూడుప్రజాసూత్రాలే" మూలంఅని రుజువు చేయబోతారు. కమ్యూనిజానికి ప్రాణంపోసిన కారణాలు మాయమైనవంటారు. ఈ సిద్ధాంతాన్ని ఆసరాచేసుకుని, కమ్యూనిస్టు సైన్యాలపైకీ, షణ్‌సీ—కంసు—నింగ్సియా సరిహద్దు రాష్ట్రంపైకీ, దండయాత్ర లేవదీస్తున్నారు. దీని అట్టడుగున ఉన్న ఉద్దేశ్య మేమంటే విప్లవాన్ని తుడిచిపెట్టడం; జపాను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజాతంత్ర హక్కుల కొరకు పోరాడే ప్రజాశక్తులను భస్మాసురంగా నాశనం చేయడం. చివరకేంజరుగుతుంది, జపానుకు లొంగడం జరుగుతుంది.

ఈ భస్మాసుర కార్యక్రమానికి జపానువాళ్ళు మంచి పకడ్‌బందుగా ప్లాను వేసుకొని, మరీ సహాయం చేస్తున్నారు. ఒక్క సైనికశక్తితోనే చైనాను జయించడం దుర్ఘటమని జపాను తెలుసుకుంది. అందుకనే హాంకో ఆక్రమణ తరు

వాత చైనాలో రాజకీయ దండయాత్రగూడా ప్రారంభించింది. ఈరాజకీయ దండయాత్ర జపాను వ్యతిరేక శిబిరంలో ఊగిస లాడే ఘటాలను వశంచేసుకోడానికి, ఐక్యసంఘటనను భగ్నం చేయడానికి, కొమింటాంగ్–కమ్యూనిస్టుల సహకారాన్ని చిట్లగొట్టడానికే సాగించబడుతూంది. ఈరాజకీయదండయాత్రకుతోడు చైనాజాతీయ బూర్జువాలకు సమిష్టివ్యాపారం పేరుతో ఆరికసౌకర్యాలిస్తామని ఆశలు చూపుతున్నారు. మంచి ఎత్తే!

ఈ స్కీముప్రకారం జపాను చైనాపెట్టుబడిదారులను మధ్యచైనాలోనూ, దక్షిణచైనాలోనూ పెట్టుబడిపెట్టనిస్తుంది. మొత్తం పెట్టుబడిలో నూటికి 51 వంతులు చైనావారివి. మిగిలిన 49 వంతులూ జపానువాళ్ళవి. ఉత్తరచైనాలో చైనావారివి49వంతులూ, జపానువాళ్ళవి 51 వంతులూ పెట్టుబడి ఉంటుంది.అదీగాక పూర్వం చైనావారికి చెందినఆస్తిని గూడా తిరిగి యిచ్చివేయడానికి జపాను అంగీకరించింది.సిగ్గూ ఎగ్గూలేని చైనాపెట్టుబడిదారులు కొందరు ఏగడ్డిగరచినా లాభంవస్తేచాలుననుకొని ఆవైపుకుమళ్లారు. వీళ్ళకు వాంగ్–చింగ్–వీ నాయకుడు. ఇంకా జపానువ్యతిరేక శిబిరంలోనే ఉన్న మరికొందరు ఆశపోతులు జపానుతో రాజీమొప్పడానికి కలలు గంటున్నారు. అయితే వీళ్ళభయం ఏమిటంటే, కమ్యూనిస్టులు తప్పకుండా వ్యతిరేకిస్తారనీ ప్రజలంతా "ద్రోహీ!" అని పిలుస్తారనిన్నీ. ఈబాధలమూలంగా, వాళ్ళు యింకా మంచివాళ్ళనిపించుకోవడానికి పాటుబడుతున్నారు,

ఈ ప్లాను తయారైంది. ఇంక ప్రజలను మోసం చేయాలి. కొంతమంది ట్రాట్స్కీవాదులనూ, మరికొంత

మంది కిరాయి రాతగాళ్ళనూ పోగుచేశారు. "ఒకేయెత్తులో విప్లవం రావాలి! చైనాకు కమ్యూనిజం పనికిరాదు! చైనాలో కమ్యూనిస్టుపార్టీ ఉండనవసరంలేదు! కమ్యూనిస్టు సైన్యాలు యుద్ధప్రయత్నాల నాటంక పరుస్తున్నాయి! కమ్యూనిస్టుసైన్యాలు గెరిల్లాయుద్ధం చేస్తూన్నమాట అబద్ధం! కమ్యూనిస్టులు చైనాను భూస్వాములకు పంచిపెట్టేస్తారు! కమ్యూనిస్టులు ప్రభుత్వసైనికాధికారాన్ని ధిక్కరిస్తున్నారు! కమ్యూనిస్టులు చైనాను చీలగొడుతున్నారు! కమ్యూనిస్టుపార్టీ కుట్రలు పన్నుతున్నది; తిరుగుబాట్లు లేవదీస్తున్నది!! యిలా అల్లరి చేయమని ఆ గాంగులను ఆజ్ఞాపించారు.

ఈ అల్లరి వ్యవహారమంతా ఎందుకు చేస్తున్నారు. లొంగిపోవడానికిముందు అనుకూలమైన వాతావరణాన్ని కల్పించడానికి; జపానుకు లొంగిపోవడానికి; జపానువాళ్ళాశ పెట్టిన 51 వంతులూ, 49 వంతులూ పేర్లు సంపాయించుకోడానికి; జాతిప్రయోజనాలను బుగ్గిలో కలపడానికీను. ఈ పెద్దమనుషులు 'ఒక్కయెత్తులోనే విప్లవ మంటేనూ, కమ్యూనిస్టుపార్టీని వ్యతిరేకించడమంటేనూ,చూపెట్టే హుషారుకు కారణమేమిటి? అసలువిప్లవాన్నే తుడిచిపెట్టేసి, ఆ 51, 49 వంతులపేర్లను పొందాలనే పేరాసే కారణం. ఇదీ గమనించాల్సిన విషయం.

మరో రకం మనుషులున్నారు. వీరు"ఒకేయెత్తులో విప్లవమనీ," "ఒక్కదెబ్బలో రాజకీయ' సామాజిక విప్లవాన్ని పూర్తి చేయాలని" చేసే అల్లరితో ఆకర్షింప బడుతున్నారు. వీరికి దురుద్దేశ్యం లేదుగాని విప్లవం యొక్క నడ

కను, అంటే ఒకవిప్లవానికీ మరోవిప్లవానికి మధ్య కొంత పరిణామకాలం, అంటే మార్పుకు కొంత వ్యవధి ఉండాలిసిన అవసరాన్ని గుర్తించడంలేదు. "వాళ్ళుగూడా ఒకేదెబ్బన రాజకీయ సామాజిక విప్లవం సంపూర్తి గావాలని" పిచ్చివాగుడు మొదలెట్టారు. అలాంటి వాగుడుతో విప్లవంయొక్క రెండు దశలూ తికమకలు చేస్తారు; ప్రస్తుత సమయంలో నిర్వర్తించవలసిన ప్రజాస్వామిక బాధ్యతల ప్రాముఖ్యాన్ని సరిగా గుర్తించక పోవడంవల్ల అసలు విప్లవానికే నష్టం కలుగ జేస్తారు. విప్లవంయొక్క మొదటిదశ రెండోదశకు పునాదిగా ఉండాలి. ఈ రెండుదశలకు మధ్య బూర్జువా నియంతృత్వమనే మూడో దశను యిరికించరాదు. మన విప్లవంయొక్క ప్రజాస్వామిక దశకు ప్రత్యేకబాధ్యతలూ, కార్యక్రమాలూ లేవన గూడదు. ఒకదశలో తరువాత వచ్చేమరోదశకు సంబంధించిన బాధ్యతలను నెరవేర్చడం సాధ్యంగాదు. ఉదాహరణకు: ప్రజాస్వామిక దశలోనే సోషలిస్టుదశయొక్క బాధ్యతలను నిర్వర్తించడం సాధ్యమౌతుందనుకోడం వట్టిభ్రమా; వట్టిఊహాగానం. ఇదినిజమైన విప్లవవాది యెవరూ ఆలోచించాలిసిన పంథా గాదు.

కరడుగట్టిన బూర్జువా లిక్విడేటర్ అడ్డుపుల్ల వెయ్యొచ్చు "మంచిది మీరు సోషలిజాన్ని వాయిదా వేసుకున్నారు. మూడు ప్రజాసూత్రాల నాచరించడమే యీనాడు చైనా కత్యవసరమంటున్నారు. వాటిని తు. చ తప్పకుండా ఆచరణలోకి తీసుకురావడానికి పోరాడుతున్నామంటుంది మీ పార్టీ! అలాంటప్పుడు మీ కమ్యూనిజాన్ని తాత్కాలికంగా వాయిదా వెయ్యరాదా ?" అంటారు.

"ఏకపార్టీనియంతృత్వ" సిద్ధాంతాన్ని పట్టుకుని పీకులాడే వాళ్లంతా యీవాదాన్నే ఏకరువుపెడుతుండారు. ఈ అర్థంలేని అల్లరంతా, విప్లవ వ్యతిరేకులైన మొండివాళ్ల నిరంకుశాభిప్రాయాలెలాఉంటాయో తెలుపుతుంది.

కమ్యూనిస్టు దృక్పథం ప్రపంచ బూర్జవాయుగంలో వచ్చినసిద్ధాంత అభివృద్ధికంతటికీ ఫలితమే. అంతేకాక కమ్యూనిజం ఒక నూతనమైన సమాజవిధానము. కమ్యూనిస్టు సిద్ధాంతమూ, కమ్యూనిస్టు సమాజమూ, మిగతావాటికన్నా విలక్షణంగా, వేరుగాఉంటాయి. అవి అన్నిటికన్నా శాస్త్రబద్ధమైన సిద్ధాంతమూ, శాస్త్రబద్ధమైన సామాజిక విధానమూను. అన్నిటికన్నా సమగ్రమూ, అభ్యుదయకరమూ, విప్లవయుతమూను. జమీందారీ సమాజవిధానమూ, సిద్ధాంతమూ చరిత్రయొక్క మ్యూజియంలో చేరాయి, బూజుపట్టాయి. పెట్టుబడిదారీ సమాజవిధానానికీ సిద్ధాంతానికిగూడా కొంతవరకదే గతిపట్టింది. సోవియట్‌యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానంసంగతి పాతచరిత్రే, మిగిలిన దేశాల్లోగూడా యీ పెట్టుబడిదారీసౌధం కూలిపోతూన్నది. ఒక కమ్యూనిస్టు సిద్ధాంతమూ, కమ్యూనిస్టువిధాన సమాజమూ మాత్రమే ప్రపంచంలో సంపూర్ణవికాసంతో బలపడుతున్నాయి. శాస్త్రీయమైన సామ్యవాదం అభివృద్ధి చెందడం మూలంగా, చైనాలో ప్రజలభావాలు విశాలములైనాయి. సోషలిస్టు విప్లవదశ సంగతలా ఉండనీయండి; ప్రజాస్వామిక విప్లవం జయంపొందడానికే, కమ్యూనిజంయొక్కనాయకత్వం అత్యావసరం. అందువల్లనే కరడుగట్టిన బూర్జువాలు కమ్యూనిజాన్ని కట్టిపెట్టమనిఅంతబిగ్గరగా అరుస్తున్నారు. కాని కమ్యూనిజాన్ని

కట్టిపెట్టేయడానికి వీల్లేదు. ఒక్కమారు కమ్యూనిజాన్ని కట్టి పెట్టేస్తే చైనాయిక బ్రతకబోదు. ప్రపంచమంతా రక్షణకొరకు కమ్యూనిజంవైపు జూస్తూన్నది. అలాగే నేటిచైనాగూడా.

సమాజ నిర్మాణ స్వరూపం ఆఖరుకెలా ఉండాలి? ఈ మధ్య కాలంలో ఆచరణలో పెట్టవలసిన కార్యక్రమం యెలా ఉండాలి? ఈరెండు విషయాల్లోనూ కమ్యూనిస్టు పార్టీ స్వంత దృక్పథం ఒకదాన్ని దిద్దుకుంది. అంటే కమ్యూనిస్టు పార్టీకి గరిష్ట కార్యక్రమమూ కనిష్ట కార్యక్రమమూ ఉన్నాయి. ప్రస్తుతానికి నూతన ప్రజాస్వామికమూ, భవిష్యత్తుకు సోషలిజమూ, యీ రెండూ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలో ఉన్న రెండు భాగాలు. ఇవి కమ్యూనిస్టు సిద్ధాంత నాయకత్వం క్రింద ఆచరణలో పెట్టవలసినవే. కమ్యూనిస్టు పార్టీ యొక్క ప్రస్తుత కనీస కార్యక్రమమూ, "మూడు సూత్రాలపై ఆధారపడిన కార్యక్రమమూ, సందర్భ శుద్ధిలోనూ, ముఖ్యవిషయాల్లోనూ ఒకటే అయినప్పుడు, కమ్యూనిజాన్ని కట్టి పెట్టమనడం వట్టిచాదస్తంగాదా? కమ్యూనిస్టులు యిలా పూర్వాన్నీ ప్రస్తుతాన్నీ సమన్వయంచేసి సందర్భ శుద్ధితో పరిశీలిస్తారు గాబట్టే, "మూడు ప్రజా సూత్రాలే జపాను వ్యతిరేక సంఘటనకు రాజకీయ పునాదిగా ఉంటా యని గ్రహించగలిగారు. అందువల్లనే వారు "మూడు ప్రజాసూత్రాలు" ప్రస్తుత పరిస్థితులను బట్టి చైనా యొక్క అవసరాలకు వరిస్తాయని గుర్తించారు. వాటిని సాధించ డానికి పోరాడాలని దీక్షపట్టారు. కమ్యూనిస్టులిది గ్రహించక పోయి వున్నట్లయితే (కొమింటాంగుతో) రాజీకి ఆ నాడటు వంటి అవకాశం కలిగేదిగాదు.

ఇదే ప్రజాతంత్రవిప్లవదశలో కమ్యూనిజానికీ, మూడు ప్రజాసూత్రాలకూ, ఐక్యత అంటేఅర్థం. ఈఐక్యతనుగురించే డాక్టరు సన్ యట్ సేన్ "కమ్యూనిజానికీ, మూడుప్రజా సూత్రాలకూ, దగ్గరమైత్రి" అని చాలాగొప్పగా చెప్పాడు. కమ్యూనిజాన్ని నిరాకరించడమంటే నిజానికి ఐక్యసంఘటనను నిరాకరించడమే. "ఏకపార్టీ"విధానం నమ్మిన బూర్జువాలు ఐక్య సంఘటనను నిరాకరించడం వల్లనే కమ్యూనిజాన్ని రద్దు చేయాలనే అర్థంలేని ఆర్గ్యుమెంటు తలెత్తింది.

అసలు ఏకపార్టీసిద్ధాంతంలోనే అర్థంలేదు. వర్గాలున్నంతవరకు. ప్రతివర్గానికీ ఒక్కో సిద్ధాంతం ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఒకవర్గంలోనే వివిధ ముఠాలు వేర్వేరు సిద్ధాంతాలు నమ్ముతుంటారు. జమీందారులకు జమీందారీ దృక్పథమూ, బౌద్ధసన్యాసులకు బౌద్ధమతదృక్పథమూ క్రైస్తవులకు క్రైస్తవమతదృక్పథము, రైతులకు బహుదైవికవాదము ...... ఇటీవల బైలుదేరిన కెమాల్ పాషాపంథా, ఫేసిస్టు పంథాలూ....శ్రమనుబట్టి పంపకం చెయ్యాలనే సిద్ధాంతమూ మొదలైనవి. ఇన్ని సిద్ధాంతాలుండగా శ్రామికవర్గానికి కమ్యూనిజం ఎందుకుండకూడదు? "కమ్యూనిజం కట్టిపెట్టండని" నినాదం ఎందుకు లేవదీయాలి. నిజానికి చెప్పాలంటే కమ్యూనిజంకట్టిపెట్టాలనే భావమే అసంభవమైనది. దీన్ని పరీక్షకుపెట్టి, పరీక్షలో కమ్యూనిజమే ఓడిపోయినట్లయితే ఎవ్వరినీ నిందించవలసిన పనిలేదు. మనలను మనమే నిందించుకోవాలి. నిజానికి కట్టిపెట్టేయాలిసింది కమ్యూనిజంకాదు. ప్రజాస్వామికానికి వ్యతిరేకమైన "ఏకపార్టీసిద్ధాంతాన్ని" వేంటనే, వెన్వెంటనే రద్దుచేయడానికి ప్రయత్నించాలి.

# మూడు ప్రజాసూత్రాలు - కమ్యూనిజము

అపార్థాల కవకాశం లేకుండా చేయడానికి, వ్యతిరేకుల భావాలను తెలిసేట్టు విపులీకరించడానికి మూడు ప్రజా సూత్రాలకు కమ్యూనిజానికి పోలికెక్కడో, భేదమెక్కడో స్పష్టంగా తెలుసుకోవాలి.

ముఖ్యంగా చెప్పాలంటే, చైనాలో బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి సంబంధించినంత వరకు, మూడు ప్రజా సూత్రాలకూ కమ్యూనిజానికీ ఉన్న రాజకీయ కార్యక్రమాలు పరస్పరం అనుకూలించే వుంటాయి. ఇంకా యెక్కువ నిష్కర్షగా చెప్పాలంటే, విప్లవజాతీయవాదమూ, ప్రజాస్వామికమూ, ప్రజాజీవనమూ; ఇవే మూడు ప్రజా సూత్రాలు. వీటికి 1924 లో డాక్టరు సన్-యట్-సేన్ నిర్వచనం ప్రకారం అర్థం చెప్పుకుండేట్లయితే, చైనా ప్రజాస్వామిక విప్లవ కాలానికి, కమ్యూనిజంయిచ్చిన కార్యక్రమంతో ముఖ్య విషయాల్లో సరిపోల్తాయి. ఇలా రెండుకార్యక్రమాలూ ముఖ్యవిషయాల్లో పోలిక వుండడంవల్ల ఈ మూడు సూత్రాలను ఆచరణలో పెట్టడంద్వారా ఐక్యసంఘటనా నిర్మాణం సాధ్యపడుతుంది. ఈఐక్యసంఘటనలో రెండు సిద్ధాంతాలూ, రెండుపార్టీలూ వుంటాయి. ఈవిషయం వదలివేస్తే పొరపాటుపడ్డట్టే.

ఇక ఈ రెంటికీ భేద మెక్కడో చూద్దాం

(1) ప్రజాస్వామిక విప్లవకాలంలో ఈ రెండుకార్యక్రమాలూ కొన్ని విషయాల్లో భేదిస్తాయి. వుదాహరణకు

ప్రజాస్వామిక విప్లవకాలానికి కమ్యూనిస్టుపార్టీయిచ్చిన కార్యక్రమంలో కార్మికులకు రోజుకు ఎనిమిదిగంటలు పనే వుండాలనీ; భూమిశిస్తు పంపక విధానం విప్లవపద్ధతుల్లో పూర్తిగా మారాలనీ వున్నాయి. ఇవి మూడు ప్రజాసూత్రాల్లో అవుపడవు. అందుచేత ఆసూత్రాల ఆచరణలోగూడ ఇవి లేవు. అంటే, కమ్యూనిజమూ "మూడు ప్రజాసూత్రాలూ" ముఖ్యవిషయాల్లో పోలివున్నా పూర్తిగా రెండూ ఒకటేనన డానికి వీల్లేదు.

2. మరోభేదం చైనా విప్లవాన్ని దశలుగా విభాగించడంలో ఉంది. కమ్యూనిజం ప్రకారం విప్లవంలో ప్రజాస్వామికదశ, దానిని దాటింతరువాత సోషలిస్టు దశ రెండూ ఉన్నాయి. ప్రజాస్వామిక దశలోని కార్యక్రమం కనీస కార్యక్రమం. సోషలిస్టు దశలోని కార్యక్రమం గరిష్ట కార్యక్రమం. మూడు ప్రజాసూత్రాలు, ప్రజాస్వామిక విప్లవాన్ని గురించి మాత్రమే నిర్దేశిస్తాయి. వాటిలో సోషలిస్టు విప్లవదశను గురించి లేదు. సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి గరిష్ట కార్యక్రమాన్ని గూడా నిర్దేశించి ఉండలేదు.

(3) మూడోభేదం:సిద్ధాంతాల్లో. కమ్యూనిజంయొక్క సిద్ధాంతం గతితర్క చారిత్రిక భౌతికవాదం. 'మూడు ప్రజాసూత్రాల సిద్ధాంతమో' జీవితసంపాదనను గురించిన చారిత్రిక దృష్టి. (లేక హేతువాదదృష్టి.అను) అంటే కేవలం బ్రతుకు దెరువుపద్ధతి. యివిరెండూ పరస్పర విరుద్ధాలు.

(4) నాలుగోభేదం: విప్లవ సమగ్రతలో, కమ్యూనిజంలో, సిద్ధాంతానికి ఆచరణకూ ఐక్యత ఉంది. కాబట్టి విప్లవం అన్ని వివరాలతో సమగ్రంగా పరిపూర్ణంగా నిర్వ

హించబడుతుంది. "మూడుప్రజాసూత్రాల" శిబిరంలో ఏకొద్దిమంది నిపుణులైన దేశభక్తుల విషయంలోనోతప్ప మిగిలిన వారివిషయంలో ఎప్పుడూ సిద్ధాంతానికీ, ఆచరణకూ మాటలకూ అంతరం ఉంటుంది. అందువల్ల "మూడుప్రజాసూత్రాలకూ" విప్లవ సమగ్రత లేదు. పరిపూర్ణత్వం లేదు.

ఇన్ని భేదాలున్నాయి కార్యక్రమాల్లో కాబట్టి ప్రజాసూత్రాలననుసరించే వారికి కమ్యూనిస్టులకూ భేదముంది. ఈ భేదాలను లెక్కజేయక పోవడం ముఖ్యవిషయాల్లో ఒకటిగావుండే యీ రెండుదృక్పథాలకూ అట్టడుగునవుండే వైరుధ్యాన్ని చూడకపోవడం పొరపాటు.

పైచర్చనంతటినీ మనసున బెట్టుకుంటే ఒకవిషయం స్పష్టమౌతుంది. కమ్యూనిస్టు వ్యతిరేకులు, 'కమ్యూనిజం కట్టిపెట్టండి' అని అరచే అరపులకు నిజంగా అర్థమేమిటో తెలుసుకో గలిగాము. వాళ్ళు నిరంకుశ పరిపాలనను స్థాపింపదలచుకున్నారు. లేకపోతే ఆ అరపులకర్థం లేదు.

ఈ కరడుగట్టిన మొండిపెట్టుబడిదారులు చరిత్ర ఎలా నడుస్తుందో ఏమీ పరిశీలించరు. చరిత్ర నడకను గురించి వాళ్ళకున్న జ్ఞానం ఓ,న.మాలకన్న అన్యాయం. కమ్యూనిజానికీ 'మూడు ప్రజాసూత్రాలకూ, లేక 'కొత్త మూడు ప్రజాసూత్రాలకూ, 'పాత మూడు ప్రజాసూత్రాలకూ' భేదంగాని తెలుసుకోవాలని యేమీ యిష్టముండదు. వాళ్ళసలు తెలుసుకోదలచ లేదు.

మేం కమ్యూనిస్టులం, జపాన్ వ్యతిరేక ఐక్యసంఘటనకు "మూడు ప్రజాసూత్రాలు" పునాది అనుకుంటున్నాం.

నేటి చైనాకవి అవసరమనుకుంటున్నాం. అందువల్లనవి సంపూర్ణంగా ఆచరణలోనికి రావడానికి కృషిచేస్తాం:

కమ్యూనిస్టు కనీస కార్యక్రమము మూడుప్రజా సూత్రాలు ముఖ్యవిషయాల్లోసరిపోల్తాయనికూడ అంటున్నాం. మొదటిఅఖిలచైనా కొమింటాంగు మహాసభలో, డాక్టర్ సన్ యట్ సేను యిచ్చిన నిర్వచనంతోసహా మూడుసూత్రాలను తీసుకున్నప్పుడే ఆపోలిక. కాబట్టి ఓ కరడుకట్టిన పెట్టుబడి దారుల్లారా! మీదగ్గరనుంచి ఒకటి ఆశిస్తున్నాం. "కమ్యూనిస్టుల నరికట్టాలి," "కమ్యూనిజాన్ని రద్దుచెయ్యాలి, అని అరిచి అరిచి, అనిత్య కార్యక్రమంకాస్తా పూర్తిచేసుకున్న తరవాతైనా మొదటి అఖిలచైనా కొమింటాంగు సమావేశం ఏమని ఉద్ఘోషించిందో ఒకమారు చూడండి. అందులో డాక్టరు సన్ యట్ సేను ఏమని వక్కాణించాడో జాగ్రత్తగా గమనించండి. ఆ మూడుసూత్రాలు ఆ నిర్వచనం ప్రకారం సరియైనవి. మిగిలిన సూత్రాలేవైనా తప్పులని తోసెయ్యాలి.

మళ్లీ. తప్పుఅభిప్రాయాలు ప్రచారం చేశానన్న అపవాదు రాకుండా ఒకటిజ్ఞాపకం చేస్తున్నాను. చాలామంది కొమింటాంగు సభ్యులూ, నేనూ స్వయంగా ఉండగానే ఆ 'మూడుసూత్రా'ల తీర్మానం నూతన నిర్వచనంతోసహా ఆమోదించబడ్డది,

ఆ తీర్మానం ప్రకారం "మూడుసూత్రాలు" రెండు చారిత్రక దశలననుసరించి, రెండురకాలుగా స్పష్టంగా ప్రత్యేకించబడ్డాయి. మొదటిరకం మూడుసూత్రాలు, ఆతీర్మానం ఆమోదించబడక పూర్వంవున్నవి. పాత బూర్జువా ప్రజా

స్వామికానికి సంబంధించినవి. వాటిని పాత "మూడు ప్రజా సూత్రాలని పిలుద్దాం.

ఆ తీర్మానం ఆమోదించబడ్డ తరువాత ఆమూడు సూత్రాలు నూతనసూత్రాలైనవి. నూతనప్రజాస్వామిక విప్లవానికి సంబంధించినవైనవి. ఈ మూడు సూత్రాలు నూతన యుగానివి. "సోవియట్‌తో మైత్రి" "కమ్యూనిస్టులతో మైత్రి" "కార్మికకర్షకులతో మైత్రి" అనే మూడుసిద్ధాంతాలపైనా ఆధారపడిన నూతనసూత్రాలు నిర్దుష్టమైన మూడు సూత్రాలు. కొత్తరూపంలోకొచ్చిన యీ మూడుసూత్రాల సిద్ధాంతానికి, ఉన్నమూడుభాగాల్లో ఏభాగాన్ని లాగేసినా, మూడుసూత్రాల సిద్ధాంతమంతా బుగ్గైపోతుంది.

"మూడుసూత్రాలను" మరికొంత వివరిస్తాను.

మొదటిది:— విప్లవయుతమైనటువంటి కొత్త మూడు సూత్రాలు సోవియట్‌యూనియన్‌తో మైత్రిపై ఆధారపడాలి. సోవియట్ యూనియన్‌తో మైత్రి లేకపోతే ప్రపంచంలో ఉన్న ఒకేఒక సోషలిస్టుదేశంతో మైత్రిచేసుకోనడానికి నిరాకరిస్తే తప్పకుండా సామ్రాజ్యవాదులతోటి మైత్రి చేసుకోవలసి వస్తుంది. సరిగ్గా 1927 లో జరిగిందిదేగదా!

రెండోసామ్రాజ్యవాద యుద్ధంరాకముందు, మన మొదటిరెండేళ్ళ యుద్ధకాలంలో బ్రిటనుకుఒక వేపున అమెరికాతోనూ రెండో వేపున జపానుతోనూ వైరుధ్యాలుండేవి. ఈ వైరుధ్యాలను మనం ఉపయోగించుకొని ఉండవలసింది. రెండోసామ్రాజ్యవాద యుద్ధంవచ్చింతరువాత, యీ వైరుధ్యాలు పూర్తిగా తొలగిపోలేదుగాని, కొంతవరకు యివి పని చేయగల అవకాశాలు తగ్గాయి. మన బాధ్యతలేవో మనం

సరిగ్గా గ్రహించి ఉండకపోయినట్లైతే బ్రిటను అమెరికాలు రెచ్చగొట్టినప్పుడు రెచ్చిపోయి, చైనా సోవియట్ యూనియన్ పైన యుద్ధంలోకి దిగవలసివస్తుంది. [మావో సోవియట్ జర్మన్ యుద్ధం రాకముందే పుస్తకం రాశాడు- అను ]

అలాంటిదే జరిగివున్నట్లయితే సామ్రాజ్యవాదుల విప్లవ ప్రతీఘాత పక్షాన చైనా నిలవవలసి వస్తుంది. మన జాతీయ స్వాతంత్ర్య పోరాటం దుఃఖాంతంగా పరిణమిస్తుంది. సోషలిస్టు దేశానికీ సామ్రాజ్యవాద దేశాలకూ మధ్య ఘర్షణ పెరిగే కొద్దీ, ఈ రెండు శిబిరాల్లో దేనిలో చేరాలో చైనా నిశ్చయించుకోటం తప్పనిసరి అవుతుంది. అయితే తటస్థంగా ఉండకూడదా అని అడగవచ్చు. తటస్థంగా ఉండటానికి ఎంతమాత్రం వీల్లేదు. ఈ సమయంలో సోవియట్ జర్మనీ యుద్ధం ప్రారంభమైతే దాని విషయంలో "తటస్తత" అనేమాట వాడటంగూడా ఆత్మవంచన అవుతుంది. ఎందుకంటే ప్రపంచంలో అన్ని దేశాలూ ఈ రెండు శిబిరాల్లో దేనిలోనో ఒకదాంట్లోకి లాగబడతాయి.

కారణం, చైనా యింతవరకే ఒక సామ్రాజ్యవాద యుద్ధముపైన యుద్ధంలో దిగివుంది. శత్రువు మన దేశంలోకి చాలా దూరం చొచ్చుకొనివచ్చాడు. ఇలాంటి సమయంలో మనకంతిమ విజయం రావాలంటే సోవియట్ యూనియన్ సహాయం తప్పకుండా అవసరం. అలాంటప్పుడు చైనా గనుక సోవియట్ యూనియనుకు మారుగా సామ్రాజ్యవాద దేశాలతో చేతులుగలిపేటట్లయితే, "విప్లవం" అనేమాటను రద్దు చేసుకోవాలి. "మూడుసూత్రాల" సిద్ధాంతం విప్లవ వ్యతిరేక సిద్ధాంతమైపోతుంది.

క్లుప్తంలో చెప్పాలంటే, విప్లవ మార్గమో, విప్లవ వ్యతిరేక మార్గమోగాని "తటస్థ"పంథా అనే మూడో మార్గం ఉంటానికి వీల్లేదు.

వాంగ్ – చింగ్ – వీ ఒకప్పుడు "రెండు రంగాలమధ్య తటస్తంగా ఉండాలని" ప్రతిపాదించాడు. కాని దురదృష్ట వశాత్తు ప్రతిపాదకుడే తన ప్రతిపాదనను ఉపసంహరించు కున్నాడు. మరోమార్గం తొక్కాడు; సామ్రాజ్యవాదంతో చేతులు కలిపాడు. అదీగాక ప్రాచ్యపాశ్చాత్య సామ్రాజ్య వాదాలని రెండు సామ్రాజ్యవాదాలున్నాయి. వాంగ్ – చింగ్ – వీ ప్రాచ్య సామ్రాజ్యవాదంతో (జపానుతో) చేతులు గలిపాడు. అయితే కొందరు తూర్పునుంచి వచ్చిన శత్రువుపైన పోరాడ్డానికి పాశ్చాత్య సామ్రాజ్యవాదులతో చేరడం అట్టే అంత చెడ్డదిగాదనవచ్చును. కాని అలా చేస్తే పాశ్చాత్య సామ్రాజ్యవాదుల నాయకత్వంక్రింద ఉత్తర దిక్కుగా (కమ్యూనిస్టులపైనా, సోవియట్ యూనియన్ పైనా) దండయాత్ర సాగించవలసి వస్తుంది. అప్పుడుగూడ విప్లవం అసంభవమౌతుంది. ఈ పరిస్థితులన్నిటివల్ల తేలేదేమంటే సోవియటుయూనియన్ తో మైత్రి కలవడమే నూతనమైన మార్గం, నిర్దుష్టమైన మార్గం; విప్లవయుత మార్గం. సోవియటు వ్యతిరేక వైఖరి పనికిరాదు. సామ్రాజ్యవాదంతో మైత్రి పనికిరాదు.

రెండవది: విప్లవయుతమైన, నూతనమైన, లేక నిర్దుష్ట మైన మూడుసూత్రాలు కమ్యూనిస్టులతో మైత్రిపై ఆధార పడి వుండాలి. కమ్యూనిస్టు వ్యతిరేకతా విధానానికిది నేరుగా వ్యతిరేకం. జపానుసామ్రాజ్యవాదము, వాంగ్–చింగ్–వీ అను

సరించిన విధానము కమ్యూనిస్టు వ్యతిరేక విధానమే. కమ్యూనిస్టు వ్యతిరేకవిధానం అనుసరించదలుచుకొన్న వాళ్ళు పోండి, పోయి ఆగ్యాంగులో చేరండి. అయితే అది విద్రోహుల మార్గంగా అవుపడుతుంది గదా?

అలా అయితే జపానువాడితో గాకుండా యితరులతో కలసి కమ్యూనిస్టువిధానాన్ని పెంపకం చెయ్యాలన్న కోర్కె సంగతేమిటి? యిదికూడా హాస్యాస్పదమే. అంటే నీవెవరితో చేతులు, కలిపినా, కమ్యూనిస్టు వ్యతిరేకివయినావా ద్రోహివే. కమ్యూనిస్టు వ్యతిరేకివై ఎవరితో చేతులు గలిపినా జపానుపై ఎంతమాత్రమూ పోరాడ లేవు.

మూడో ఆలోచన ఒకటి వుంది. కమ్యూనిస్టు వ్యతిరేక విధానాన్నిస్వతంత్రంగా ఎందుకు సాగించగూడదు అని. ఇది వట్టికల. వలస విధానపు బాధలన్నీ చుట్టుముట్టి ఉండగా సామ్రాజ్యవాద విధానం యొక్క సాయంలేనిదే అలాంటి విప్లవ వ్యతిరేక విధానం ఎలా కొనసాగుతుంది? కమ్యూనిజాన్ని పదియేళ్ళపొడుగునా, సామ్రాజ్యవాద ప్రపంచమంతా కలసి వ్యతిరేకించి నిష్ఫలమైంది.

అలాంటి కమ్యూనిజాన్ని ఎవరైనా ఒంటరిగా ఎదుర్కొనటం సాధ్యమేనా? “కమ్యూనిస్టులనువ్యతిరేకించడం మంచిదే! కాని నెగ్గటంకష్టం” అంటారు. ఈమాట కొంతవరకు తప్పు,కొంతవరకుఒప్పును. కమ్యూనిస్టులను వ్యతిరేకించటం మంచిదెలా అవుతుంది.? కాదు. కమ్యూనిస్టులను ఎదిరించి గెలవడం ఎంతకష్టపడ్డా ఎలాసాధ్యపడుతుంది? సాధ్యపడదు. దీనికి కారణం కమ్యూనిజంలోలేదు. ప్రజలలోవుంది. ప్రజలకు కమ్యూనిజం అంటేయిష్టం. కమ్యూనిజానికి వ్యతిరేకమైన

దేదైనా అసహ్యం. మన దేశంలోకి చొరుచుకు వచ్చిన శత్రువును వదలిపెట్టి, కమ్యూనిజంమీద పోరాడటానికి సిద్ధమైన వాళ్ళని ప్రజలకు తెలిసిందంటేనా, ఆప్రజల క్రోధాగ్ని వాళ్ళ పాలిటికి ప్రళయాగ్నే.

అంటే తప్పదు! కమ్యూనిజాన్ని హత్యచేయదలచిన వారికది ఆత్మహత్యగా పరిణమించక తప్పదు. కమ్యూనిస్టు వ్యతిరేకులందరికీ మనం హృదయపూర్వకంగా యివ్వగలిగిన సలహా యేమంటే" మీకు ప్రాణాలు నిలుపుకోవాలని యేమన్నా ఆశఉంటే కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమం ప్రారంభించక పోవడం; అసలు ఆ ప్రయత్నమే చేయకపోవడం మంచిది. కాబట్టి "ఈనాటి మూడు సూత్రాలు కమ్యూనిస్టులతో ఐక్యతను గోరేవిగా ఉండాలన్నది నిశ్చయం. కాకపోతే మూడు సూత్రాలు చచ్చిపోతాయి. కమ్యూనిస్టుల యెడల వైఖరి మూడు సూత్రాలకు జీవన్మరణ సమస్య. కమ్యూనిస్టులతో చేతులుగలిపితే మూడు సూత్రాలు జీవిస్తాయి. లేకపోతే చచ్చిపోతాయి. ఇది కాదన సాహసించే దెవరు?

మూడవది: నూతనమూ, నిర్దుష్టమూ, విప్లవ యుతమూ, అయిన మూడు సూత్రాలు కార్మిక, కర్షకులతో మైత్రిపైన ఆధారపడాలి. కార్మిక కర్షకులతో మైత్రి లేకుండా వైదొలగితే వారి అవసరాలను విస్మరిస్తే డాక్టరు సన్ యట్ సేనుయొక్క అంత్య సందేశం కోరినట్లు ప్రజలను మేలుకొల్పే బాధ్యత నెరవేర్చకపోతే విప్లవం విఫలంకాక తప్పదు. సరిగ్గా చెప్పాలంటే యీ విధానాన్ని త్రోసిరాజన్న వారే విఫలులౌతారు. స్టాలిన్ ఒకమారు చెప్పాడు: "వలస

రాజ్యాలయొక్క నలసరాజ్య లక్షణాలు కొంతవరకున్న దేశాలయొక్క సమస్య ముఖ్యంగా రైతాంగ సమస్యయే" అని. అంటే చైనా విప్లవసమస్య ముఖ్యంగా రైతాంగ సమస్య. ప్రస్తుత జపాను వ్యతిరేక ప్రతిఘటన ముఖ్యంగా జపానుపై చైనా రైతుల యుద్ధం అన్నమాట. నూతన ప్రజాస్వామిక రాజకీయాలు ముఖ్యంగా రైతాంగానికి అధికారాన్ని అప్పజెప్పే రాజకీయాలు. కొత్త మూడు సూత్రాలు ముఖ్యంగా రైతాంగ విప్లవ సూత్రాలు. ప్రజాసంస్కృతి కావాలంటే ముఖ్యంగా రైతాంగ సంస్కృతిని ఉత్తమ దశకు తీసుకుని పోవాలని అర్థం. జపాను వ్యతిరేక యుద్ధం ముఖ్యంగా రైతాంగ విప్లవం.

ఈ విధంగా స్వభావనిర్ణయం చేయడం ఎంతవరకు సరైనదో చూడాలంటే, మనమధ్య నే, మన నిత్యకార్యాచరణ లోనే ఏంజరుగుతున్నదో తెలుసుకుంటేచాలు. మనం చేసే ప్రతిపనీ రైతులశక్తిపైన ఆధారపడి చేస్తున్నామని చూపు తున్నాం. మనసభలు, స్కూళ్ళు, పత్రికలు, రచనలు, నాట కాలు, అన్నీ రైతులకొరకే జరుపుతున్నాం. ఈయుద్ధకాలంలో, యుద్ధానికీ, మన నిత్యజీవితానికీ అవసరమైన ప్రతిదీ రైతే మనకిస్తున్నాడు. ఇక్కడ ముఖ్యంగా రైతు అనేపదం ఉప యోగిస్తున్నామంటే యితరసమస్యలనూ యితరశక్తులనూ వదలి వేయడంలేదని అర్థంచేసుకోవాలి.

చైనాజనాభాలో నూటికి ఎనభైమందికిపైగా రైతులు. అనే విషయం ప్రతిస్కూలు కుర్రవాడికికూడా సాధారణంగా తెలి సిన విషయమే. జపానువాళ్ళు మన పెద్దపట్టణాలను ఆక్ర

మించింతరువాత చైనాలో రైతులసంఖ్య మరీయెక్కువైంది. కాబట్టి రైతుసమస్య చైనా విప్లవానికి ముఖ్యసమస్య.

చైనా జనాభాలో రైతులతరువాత పెద్దసంఖ్యగా ఉన్న వాళ్ళు కార్మికులు. అనేకలక్షలమంది పారిశ్రామిక కార్మికులున్నారు. చేతిపనులలోని కార్మికులూ, వ్యవసాయకూలీలూ కలిసి ఒక్కకోటిమంది ఉంటారు. జాతీయ ఆర్థికజీవనంలో పారిశ్రామికశాఖను నడిపేది కార్మికులు. కార్మికులు లేకుండా చైనాకు బ్రతుకేలేదు. కార్మికులు ప్రజలందరిలోనూ ఎక్కువ విప్లవచైతన్యం గలవారు, అగ్రగాములు, విప్లవనాయకులు. కార్మికులు లేకుండా చైనా విప్లవం విజయంపొందజాలదు. కాబట్టి విప్లవయుతమైన కొత్తమూడుసూత్రాలు కార్మికకర్షకుల అవసరాల కొరకు కృషిచేసేవిగా ఉండాలి. కార్మికకర్షక ప్రయోజనాలను చూడనక్కరలేదనీ, ప్రజలను మేల్కొలపనక్కరలేదనీ, చెప్పే "మూడుసూత్రాలే" వున్నాయంటే అవి ఎండిరాలిపోక తప్పదు.

ఇంతకూ ప్రశ్నసారాంశమేమంటే, సోవియట్యూనియన్‌తోటీ, కమ్యూనిస్టులతోటీ మైత్రిని నిరాకరించి, కార్మికకర్షకప్రయోజనాలను విస్మరించి ప్రతిపాదింపబడే మూడుసూత్రాలు నిరుపయోగమైనవి. "మూడుసూత్రాలను నిండుచైతన్యంతో అనుసరించేవారెవరైనా యీ విషయాన్ని శ్రద్ధగా గమనించాలి."

ఈ విధానాలమీద ఆధారపడ్డ "మూడుసూత్రాలే" నూతనమూ, నిర్దుష్టమూ, విప్లవయుతము అయిన మూడు సూత్రాలు. ఇవి నూతన ప్రజాస్వామికము యొక్క మూడు సూత్రాలు. పాతమూడు సూత్రాలకన్నా అభివృద్ధి చెందిన రూపాలు; డాక్టరు సన్-యట్-సేన్ యొక్క భావనానైపుణ్య

ఫలితాలు; ప్రపంచ సోషలిస్టువిప్లవంలో భాగంగా అభివృద్ధి అయిన చైనా విప్లవంయొక్క చారిత్రక పరిణామ ఫలితాలు. ఇలాంటిమూడుసూత్రాలే ప్రస్తుత చైనాపరిస్థితులకు సరిపడ్డవని కమ్యూనిస్టుపార్టీ తలుస్తూంది. వాటిని ఆచరణలో సాధించడానికి కమ్యూనిస్టుపార్టీ పాటుబడుతుంది. ఈ విధమైన మూడు సూత్రాలే చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రజాస్వామిక యుగానికిచ్చిన కార్యక్రమంతో అంటే కమ్యూనిస్టుపార్టీయొక్క కనీస కార్యక్రమంతో ముఖ్యవిషయాల్లో ఏకీభవిస్తాయి;

పాతమూడు సూత్రాలు చైనావిప్లవంయొక్క పూర్వయుగానికి వర్తిస్తాయి: అప్పటికింకా రష్యాలో జారుపరిపాలనే ఉందిగాబట్టి ఆసూత్రాలలో సోవియట్ యూనియన్‌తో మైత్రికి తావులేదు. అప్పటికింకా కమ్యూనిస్టుపార్టీ ఏర్పడి వుండలేదు కాబట్టి, కమ్యూనిస్టులతో ఐక్యతకు తావులేదు. అప్పటికింకా కార్మిక కర్షకఉద్యమాల ప్రాముఖ్యత గుర్తింపబడి యుండలేదు గాబట్టి, ఆసూత్రాలలో కార్మిక కర్షకులతో మైత్రికి తావులేదు.

కాబట్టి కొమింటాంగు 1924 లో పునర్నిర్మింపబడక పూర్వమున్న "మూడుసూత్రాలు" పాత మూడుసూత్రాలు. వాటికి కాలదోషం పట్టిపోయింది. వాటిని నూతనపంధాలోకి మార్చకపోతే కొమింటాంగ్ యొక్క అభివృద్ధిని అరికడతాయి. కాలజ్ఞుడైన డాక్టరు సన్‌యెట్‌సేను ఇది ముందుగాచూచాడు. చైనా కమ్యూనిస్టుపార్టీ సహాయంతో, కొత్త పరిస్థితుల కన్వయించి కొత్తనిర్వచనంయిచ్చాడు. చారిత్రకమైన నూతన అర్థాన్ని కలుగజేశాడు. మూడుసూత్రాలకూ, కమ్యూనిజానికీ ఐక్యత కుదర్చబడ్డది; మొట్టమొదటిసారిగా, కొమిం

టాంగు కమ్యూనిస్టుపార్టీలకు ఐక్యతకుదిరింది. తరువాత ఆపునాది మీదే. ప్రజల సానుభూతి సహకారాలతో మొట్ట మొదటి మహావిప్లవం సాగించబడ్డది.

“పాత మూడుసూత్రాలు” ఆ యుగంయొక్క చారిత్రక ప్రత్యేకతను ప్రతిబింబించాయి. అందువల్ల ఆయుగంలో అవి విప్లవకరమైనవిగా ఉండేవి. కాని కొత్తయుగం ప్రవేశించింతరవాత పాత సూత్రాలు విప్లవ నిరోధకాలైనవి. కొత్తయుగం ప్రవేశించింతరవాత, “కొత్త మూడు సూత్రాల” రూపేర్పడ్డ తరవాతి పాత మూడు సూత్రాలకు ప్రాణం పోయడాని కేమాత్రం ప్రయత్నించినా; సోవియటు యూనియన్ స్థాపించబడ్డ తరవాత “ఆ సోషలిస్టు దేశంతో మైత్రిని” ఏమాత్రం వ్యతిరేకించినా; కమ్యూనిస్టుపార్టీ ఏర్పడ్డ తరవాత “కమ్యూనిస్టులతో ఐక్యతను” ఏ మాత్రం వ్యతిరేకించినా; కార్మిక కర్షకులు మేల్కొని తమ రాజకీయ చైతన్యం ప్రదర్శించింతరవాత, కార్మిక, కర్షకులతో “ఐక్యతను” ఏ మాత్రం వ్యతిరేకించినా; అలాంటి వ్యతిరేక ప్రయత్నం యేదైనా విప్లవవ్యతిరేకమనీ, చారిత్రికాభివృద్ధి నిరోధకమనీ, ఖండితంగా చెప్పాలి. 1927 తరవాత వచ్చిన విప్లవ నిరోధకోద్యమం యీ దుష్ప్రయత్నానికి ఫలితమే.

“చారిత్రికాభివృద్ధి మార్గాన్ని అర్థం చేసుకున్నవాళ్ళు వీరబిరుదాని కర్హులు” “మూడు సూత్రాలను ప్రస్తుత పరిస్థితుల్లో ఆచరణలో పెట్టేవారందరూ పై వాక్యాన్ని మనసులో పెట్టుకోవాలని కోరుతున్నాను.

పాత మూడు సూత్రాలకూ, కమ్యూనిస్టుపార్టీయొక్క కనీస కార్యక్రమానికి ఎందులోనూ పోలిక లేదు. ఎందు

కంటే అతిపాతకాలంలో పుట్టినవి. ఇప్పుడాకాలం గతించింది. ఇంకా సోవియటుకు, కమ్యూనిస్టులకూ, కార్మిక కర్షకులకూ వ్యతిరేకమైన మూడుసూత్రాలే వైనావుంటే అవి అభివృద్ధి నిరోధకాలు విప్లవవ్యతిరేకాలు. అవి కమ్యూనిస్టుల కనీసకార్య క్రమంతో పోలికలేనివి. కావడమేగాదు, అసలు కమ్యూనిజానికే పరమశత్రువులు. 'మూడుసూత్రాల' యెడల అభిమానం గలవారు మనోవిషయాన్ని బాగాఆలోచించాలి.

చైతన్యంగల ఏ ప్రజావర్గంకూడా మూడుసూత్రాలనూ దిగత్రొక్కరు అనేది స్పష్టం. కనీసంసామ్రాజ్యవాదవ్యతిరేక బాధ్యతలు, జమీందారీవ్యతిరేక బాధ్యతలు, నిర్వర్తించేవరకైనా, విప్లవంయొక్క రెండోదశకుపోవడానికి పునాదులుఏర్పడేంతవరకైనా ఆపనిచేయరు. వాంగ్-చింగ్-వీ అలాంటిరకాలు మాత్రం దిగత్రొక్కగలరు. సోవియటు వ్యతిరేకత, కమ్యూనిస్టు వ్యతిరేకత, కార్మికకర్షకవ్యతిరేకతా ఈమూడువిధానాలుగల మూడుసూత్రాలు వాంగ్-చింగ్-వీ అండ్ కంపెనీకి ఉన్నాయి. నీటిపేరిట వాళ్ళెంతి డబ్బావాయిస్తున్నా, న్యాయబుద్ధీ, రాజకీయచైతన్యం, గల ప్రజలంతా డాక్టర్ సన్-యట్-సేన్ యొక్క నిజమైన మూడుసూత్రాలనే అనుసరిస్తున్నారు. 1927లో అభివృద్ధినిరోధకులు గెలిచింతరువాతకూడా, చైనావిప్లవంలో నిజమైన "మూడుప్రజాసూత్రాలనూ అనుసరించినవారున్నారు. అలాంటప్పుడు శత్రువు సరిగ్గా నెత్తినెక్కి కూచున్న ఈరోజులలో, అలా మూడు సూత్రాల ననుసరించేవాళ్ళు యింకా లక్షల లక్షలుండాలి. అలాంటివారందరితోటీ కమ్యూనిస్టులమైనమేము చివరివరకూ సహకారించ చేస్తాం. ద్రోహులలనూ కరుడుగట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకులనూ తప్ప మరెవ్వరినీ త్రోసివెయ్యజాలము.

# సంస్కృతి - పాతా, కొత్తా

ఇంతవరకు నూతనయుగంలో చైనా రాజకీయాల చారిత్రక ప్రత్యేకతను గురించీ, నూతన ప్రజాస్వామిక సమస్యను గురించీ వివరించాం. ఇప్పుడు మనం సంస్కృతిని గురించి విచారించాలి.

సంస్కృతి సమకాలికమైన సమాజంయొక్క ఆర్థిక రాజకీయ వ్యవస్థలకు భావప్రతిబింబం. చైనాలో సామ్రాజ్యవాద ప్రభుత్వానికి ప్రతిబింబమైన సామ్రాజ్యవాద సంస్కృతి ఉంది. ఈ సామ్రాజ్యవాద సంస్కృతి సామ్రాజ్యవాదులు ప్రత్యక్షంగా నడిపే సంస్కృతీ సంస్థలద్వారా గానీ, లేక కొంతమంది సిగ్గువిడిచి నడిపే సంస్థలద్వారాగానీ ప్రచారం చేయబడుతుంది. ఈ సంస్థలలో నానా బానిస భావాలు ప్రబోధిస్తారు. ఇవిగాక చైనాలో క్షీణిస్తూన్న జమీందారీ విధానానికి సంబంధించిన ఆర్థిక రాజకీయ వ్యవస్థలకు ప్రతిబింబమైన జమీందారీ సంస్కృతికూడా ఉంది. కన్‌ఫ్యూషియస్‌ను గౌరవించాలని ప్రచారం చేసేవారూ, పురాతనమైన సామాజికనీతినే అవలంబించేవారూ, పూర్వ సామాజిక సంబంధాలను, సిద్ధాంతాలను బలపరుస్తూ నూతన సంస్కృతినీ, నూతన భావపరిణామాన్నీ వ్యతిరేకించేవారందరూ క్షీణించుతూన్న జమీందారీ సంస్కృతికి ప్రబోధకులు. ఈ క్షీణిస్తూన్న జమీందారీ సంస్కృతీ, సామ్రాజ్యవాద సంస్కృతీ రెండూ కవలపిల్లలాంటివి. ఇవి బహుకాలం కలిసి పనిచేసి నూతన చైనా సంస్కృతిని అరికట్టడానికి ప్రయత్నిం

చినవి. ఈ రెండు సంస్కృతులూ, సామ్రాజ్యవాద జమీందారీ వర్గాల ప్రయోజనాలకు దోహదమిస్తాయి. అందువల్ల యీ రెండు సంస్కృతులపై పోరాడి జయించాలి.

ఈ రెండు సంస్కృతులు అడ్డమున్నంతకాలమూ నూతన సంస్కృతి ఏదీ తలెత్తజాలదు. ఈ సంస్కృతులకూ, నూతనసంస్కృతికీ మధ్యపోరాటము జీవన్మరణ పోరాటమే.

ఇక నూతనసంస్కృతి నూతనరాజకీయ ఆర్థికవ్యవస్థలకూ, తాను దోహదంచేసే నూతనప్రయోజనాలకూ, భావ ప్రతిబింబమే. పెట్టుబడిదారీ ఆర్థికవిధానం ఆరంభమైననాటి నుంచీ చైనాలోని జమీందారీవిధానం క్షీణించుతూవచ్చింది. పూర్తిగా క్షీణించలేదు. కొంతవరకు పెట్టుబడిదారీ ఆర్థిక విధానం అమల్లోకివచ్చింది. జమీందారీ ఆర్థికవిధానంకన్నా పెట్టుబడిదారీ ఆర్థికవిధానం అభివృద్ధికరమైనది. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడంతోపాటు, నూతనరాజకీయ శక్తులభివృద్ధి చెందినాయి, చెందుతున్నాయి. అవి బూర్జువా, పెట్టీబూర్జువా శ్రామికశక్తులు. ఈ వర్గాలలో చైతన్యవంతులైనవారి తరఫున ప్రాతినిధ్యం వహించే విప్లవపార్టీలు అనేకమున్నాయి. వాటిలో అన్నిటికన్నా పలుకుబడిగలవి కొమింటాంగు, కమ్యూనిస్టుపార్టీలు. కాబట్టి పెట్టుబడిదారీ ఆర్థికవిధానం లేకుండా బూర్జువా, పెట్టీబూర్జువా శ్రామికవర్గాలు లేకుండా, నూతనభావ పరిణామమూ, నూతనసంస్కృతీ ఉండడం అసంభవము.

ఈ నూతన ఆర్థిక, రాజకీయ, సంస్కృతీ రూపాలే చైనాయొక్క విప్లవశక్తులు. ఈనూతన విప్లవశక్తులు చైనాలో ఉన్న పాత ఆర్థిక రాజకీయ సంస్కృతీరూపాలకు వ్యతిరేకాలు.

ఈ పాతరూపాలు చైనాలో క్షీణిస్తూన్న జమీందారీ విధాన ఆర్థిక రాజకీయ సంస్కృతులున్నూ, విదేశీ సామ్రాజ్యవాద ఆర్థిక రాజకీయ సంస్కృతులున్నూ కలిసి ఏర్పడ్డ రూపాలే. (ఈరెంటిలోనూ సామ్రాజ్యవాద ఆర్థిక రాజకీయ సంస్కృతు లెక్కువ బలీయమైనవి.) పాతరూపాలు అభివృద్ధినిరోధకాలు కాబట్టి సంపూర్ణంగా నాశనం చేయబడాలి.

విప్లవవర్గాలకు చెందిన ప్రజాశక్తులకూ, సామ్రాజ్య వాదా జమీందారీవర్గాలకు చెందిన పాతశక్తులకూ మధ్య జరిగే పోరాటమే చైనాసామాజికపోరాటం. విప్లవశక్తులకూ విప్లవవ్యతిరేక శక్తులకు మధ్యజరిగే యీపోరాటం గడిచిన నూరేండ్లనుంచీ—అంటే నల్లమందుయుద్ధంనుంచీ యిప్పటివరకు సాగుతూనేయుంది. చైతన్యయుతంగా పోరాటం సాగటం మాత్రం 1917 విప్లవం మొదలు దాదాపు ఈముఫైయేళ్ళ పాటు సాగుతూనే వచ్చింది.

అయితే పైనచెప్పినట్లు, అప్పటికప్పుడు విప్లవంయొక్క స్వభావమే మారిపోతూంటుంది. ఒకకాలంలో కొత్తదైనది తరువాత మరొకకాలానికి పాతబడవచ్చును. చైనాబూర్జువా ప్రజాస్వామిక విప్లవం నడచిన నూరేళ్ళకాలాన్నీ రెండుభాగాలుగా విభజించవచ్చును. అయితే చారిత్రక ప్రత్యేకతలననుసరించి యీవిభాగం జరగాలి. మొదటి యెనభైయేళ్లూనడచిన చైనా బూర్జువా ప్రజాస్వామికానికి చెందినవిప్లవం పాతరకానికి చెందిన విప్లవం. చివరి ఈ ఇరవైఏండ్లూ దేశంలోనూ, విదేశాల్లోనూ వచ్చిన రాజకీయ పరిణామాలవల్ల విప్లవస్వభావం మారిపోయింది. మొదటి ఎనభైయేండ్లకు పూర్వపు ఫక్కీ ప్రజాస్వామికలక్ష్యం. చివరి ఈ యిరవైఏండ్లలోనూ వచ్చిన

ప్రత్యేకత ఏమంటే "నూతన ప్రజాస్వామికం" స్థాపించడమే ఆశయమైంది. ఈ భేదం రాజకీయ రంగంలోనూ, సంస్కృతీ రంగంలోనూ గూడా వర్తించుతూంది.

సంస్కృతీ రంగంలో యీనూతన ప్రత్యేకత ఎలా ప్రస్ఫురించిందో చూద్దాం.

1919 మే 4 ఉద్యమం సంస్కృతీ రంగంలో యుగ భేదాన్ని సూచించిన తొలిగరు పోగు.

"మే 4" ఉద్యమానికి పూర్వం బూర్జువావర్గంయొక్క నూతన సంస్కృతికీ, జమీందారీవర్గం యొక్క పురాతన సంస్కృతికీ జరిగిన పోరాటమే సంస్కృతీ రంగంలో జరిగిన పోరాటం. మే 4 ఉద్యమానికి పూర్వం గురుకులవాసానికీ, ఆధునిక విద్యావిధానానికీ; పురాతన విజ్ఞానానికీ, నూతన విజ్ఞానానికీ; నాటు ఊహలపోకడలకూ, పాశ్చాత్యనాగరికతా ప్రచారానికీ మధ్యసంఘర్షణలు వచ్చాయి.

సనాతన జమీందారీ యుగాలనాటి విషపూరిత భావాలనూ, ఆనాటి విద్యాగోష్టులనూ నిరసించి, ప్రకృతిశాస్త్ర విజ్ఞానాన్నీ, సామాజిక శాస్త్రవిజ్ఞానాన్నీ ప్రచారం చేయడం బూర్జువాలయొక్క ప్రముఖవాంఛ. ఆనాటి పండితుడైన ఎన్ ఫూ చైనాలో డార్విన్ యొక్క పరిణామవాదాన్నీ, ఆడమ్ స్మిత్ యొక్క అర్థశాస్త్రాన్నీ, ముల్లరుయొక్క నీతిశాస్త్రాన్నీ మాంటెస్క్యూయొక్క సామాజికశాస్త్రాన్నీ, మరియితర ప్రకృతిశాస్త్రాలనూ ప్రవేశపెట్టాడు. ఈశాస్త్రజ్ఞానప్రచారమే, మే 4 ఉద్యమానికి పూర్వం నూతన విజ్ఞానపతాకాన్ని నిలువబెట్టినవారి ముఖ్య అభిమతం. ఆరోజుల్లో అలాంటి నూతన భావాలు. సనాతన జమీందారీ విజ్ఞానంపైన జరిగిన పోరా

టాల్లో విప్లవపాత్రను నిర్వహించాయి. అందువల్ల ఆభావాలు ఆనాటి బూర్జువా ప్రయోజనాలకు దోహద మిచ్చాయి.

కాని సామ్రాజ్య వాద యుగంలో పూర్వపు బూర్జువాల భావాలు బలహీనాలని తేలింది. విదేశ సామ్రాజ్యవాదం ప్రేరేపించే బానిసభావాలూ, స్వదేశ జమిందారీ విధానం ప్రేరేపించే సనాతన భావాలూ కలిసి యేర్పడ్డ విప్లవ నిరోధక శక్తి ముందు పూర్వపు బూర్జువా భావాలు నిలువలేక పోయినవి. ఈదుష్టకూటమి సాగించిన మొదటదాడికే కూలి పోయినవి. సామ్రాజ్యవాదం సాగించిన దాడిముందు పూర్వపు బూర్జువా ప్రజాస్వామికం నీరుగారి పోయింది. కాబట్టే పూర్వపు బూర్జువా ప్రజాస్వామికసంస్కృతిగూడ అపజయం పొందక తప్పలేదు.

కాని "మే 4" ఉద్యమం తరువాత, పరిస్థితులుమారి నవి. ఇప్పటినుంచీ పూర్తిగా ఒకకొత్తసంస్కృతి బయలుదే రింది.అది కమ్యూనిస్టుల నాయకత్వంక్రింద బయలుదేరిన కమ్యూ నిస్టు సంస్కృతి; కమ్యూనిస్టుల ప్రపంచదృక్పథం, వారిసామా జికసిద్ధాంతమునూ. 1919లో "మే 4" ఉద్యమము, 1921లో చైనా కమ్యూనిస్టుపార్టీస్థాపనా, 1921లో చైనాకార్మికోద్యమ ప్రారంభము—ఇవన్నీ ప్రపంచయుద్ధం అయిపోయిన తరువాత, రష్యన్ విప్లవం జయించిన తరువాతా జరిగాయి. అంటే ప్రపంచ పరిణామంయొక్క నూతనదశలో జాతీయసమస్యా, వలసదేశ విప్లవ సమస్యా తలయెత్తిన తరువాతనే ఈసంఘట నలు జరిగాయి. ఈవిషయం చైనావిప్లవం ఎలాప్రపంచ పరి ణామంతో సన్నిహిత సంబంధం కలిగివుందో తెలుపుతూంది. చైనా అభివృద్ధికి దోహదమిస్తూ ఒకకొత్త రాజకీయశక్తియైన

చైనా శ్రామిక వర్గము, కమ్యూనిస్టుపార్టీ రాజకీయరంగంమీద అడుగు పెట్టగానే, అంతకుముందు అణగారిపోతూన్న నూతన సంస్కృతికి అకస్మాత్తుగా బలంవచ్చింది. కొత్తగా వచ్చిన స్నేహితుల-శ్రామికవర్గము, కమ్యూనిస్టుపార్టీల-సహాయంతో నూతన ఆయుధాలను ధరించి సామ్రాజ్యవాద జమీందారీ సంస్కృతుల కూటమిపై ఒక్కుమ్మడిగా దాడిప్రారంభించింది.

ఈ కొత్తశక్తి. బూర్జువా భావాలదివరకే ఆక్రమించుకుని కూర్చున్న ప్రకృతి శాస్త్రరంగంమీద ఇంకా తగినస్థానాన్ని సంపాదించలేకపోయింది. కాని సామాజిక శాస్త్రరంగంలోమాత్రము బలమైన స్థానమాక్రమించి గొప్ప మార్పులకు దోహదమిచ్చింది? మన విప్లవంలో యిటీవలి ఇరవై సంవత్సరాల్లో తత్వశాస్త్రం, రాజనైతికశాస్త్రం, అర్థశాస్త్రం, యుదశాస్త్రం, చరిత్ర, సారస్వతం, కళలు (నాటకం,సినిమా, సంగీతం,శిల్పం, చిత్రలేఖనం) ఈశాస్త్రాల్లో ఎంతో విశాలమైన విప్లవకరమైన, మార్పులకు ఈ కొత్తశక్తి అవకాశం కల్పించింది. చైనా సంస్కృతీ విప్లవంకొరకు పోరాడిన యోధుల్లో లూ-సూన్ చాల గొప్పవాడు, ధీరుడు, నాయకత్వం వహించిన వ్యక్తి. లూ-సూన్ గొప్ప రచయిత మాత్రమేగాదు; గొప్ప తత్వవేత్త; గొప్ప విప్లవకారుడు కూడాను. లూసూన్ యొక్క పట్టుదల, వలస దేశ ప్రజల కుండే ఒక అమూల్యగుణం యొక్క ప్రతిబింబం. ఆయనకుండే వీరలక్షణాలు, విశాల ప్రజాసామాన్యం యొక్క-అజేయమైన ఆత్మశక్తికి చిహ్నాలు. అతడు మన చరిత్రలో ఉత్తి మోత్తమ మైన ఋజువర్తనా, ధైర్యమూ, పట్టుదల, విశ్వాస పాత్రతా, ఉత్సాహముగల జాతీయ వీరుడు. లూ

నూన్ నడుస్తున్న మార్గమే చైనా జాతియొక్క నూతన సంస్కృతి నడుస్తున్న మార్గము.

"మే 4" ఉద్యమానికి పూర్వం, చైనా సంస్కృతిపాతరకపు ప్రజాస్వామికానికి సంబంధించిన సంస్కృతిగా ఉండేది. అది ప్రపంచబూర్జువావర్గానికి సంబంధించిన సంస్కృతిలో ఒక భాగం. "మే 4" ఉద్యమంతరవాత చైనా నూతనసంస్కృతి, నూతన ప్రజాస్వామికానికి ప్రతిబింబమైన సంస్కృతిగా పరిణమించింది. అంటే ప్రపంచ సోషలిస్టు సంస్కృతీ విప్లవంలో ఒక భాగమైంది.

"మే 4" ఉద్యమానికి పూర్వం చైనా నూతన సంస్కృతీ ఉద్యమం బూర్జువా నాయకత్వంక్రింద నడిచింది. నడపగల శక్తిగూడా వారికుండేది. కాని "మే 4" ఉద్యమంతరవాత మట్టుకు, వీరిభావాలు, వీరి రాజకీయ భావాలకుగూడ అందక తీసికట్టయినవి. దీంతో వీరి నాయకత్వ పాత్రగూడ అంతరించింది. విప్లవంయొక్క యిటీవలి దశలో వీరు విప్లవ శిబిరంలోఉండి ఊరికే పాల్గొంటంమాత్రం జరుగుతూంది. ఇప్పుడు నాయకత్వం శ్రామిక సంస్కృతికి సంక్రమించింది. ఇది నిర్వివాదాంశం.

ప్రజలయొక్క సామ్రాజ్య వ్యతిరేక, జమిందారీ వ్యతిరేక సంస్కృతియే నూతన ప్రజాస్వామిక సంస్కృతి. నేటి చైనాకు అనువర్తించి చెప్పాలంటే శ్రామిక సంస్కృతి నాయకత్వం క్రింద లేక కమ్యూనిస్టు సిద్ధాంత నాయకత్వంక్రింద ఉన్న జపాను వ్యతిరేక ఐక్య సంఘటనయొక్క సంస్కృతియే "నూతన ప్రజాస్వామిక" సంస్కృతి. మరోవర్గంయొక్క సిద్ధాంతమేదీ ఈ నూతన సంస్కృతికి నాయకత్వం వహించ

లేదు. క్లుప్తంలో చెప్పాలంటే, సామ్రాజ్యవాద వ్యతిరేకము, జమిందారీ విధాన వ్యతిరేకము, అయి శ్రామికవర్గ నాయకత్వము గలిగిన ప్రజాసంస్కృతియే నూతన ప్రజాస్వామిక సంస్కృతి.

# సంస్కృతీ విప్లవం - వివిధదశలు

సంస్కృతీ విప్లవం ఆర్థిక రాజకీయ విప్లవానికి భావ స్వరూపమైన ప్రతిబింబం. అందువల్ల ఆర్థిక రాజకీయ విప్లవాన్ని సాధించడానికి ఒక ఆయుధంకూడాను. చైనా విప్లవంలో రాజకీయ రంగంలో మాదిరి సంస్కృతీ రంగంలో గూడ ఐక్య సంఘటన కవకాశం ఉంది. సంస్కృతీ విప్లవంలో ఐక్య సంఘటన గడచిన ఇరవైఏళ్ళలోనూ నాల్గుదశలను గడిచింది.

1. 1919 నుండి, 21 వరకు రెండేళ్ళు.
2. 1921 నుండి, 27 వరకు ఆరేళ్ళు.
3. 1927 నుండి, 36 వరకు తొమ్మిదేళ్ళు.
4. 1937 నుండి, 40 వరకు మూడేళ్ళు.

1919 'మే 4' ఉద్యమం మొదలు 1921 లో కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడేంతవరకూ మొదటిదశ. ఈ దశకు 'మే 4' ఉద్యమ ప్రభావం ఎక్కువగా ఉండటం ముఖ్యలక్షణం. 'మే 4' ఉద్యమం సామ్రాజ్యవాదానికీ, జమిందారీ విధానానికి వ్యతిరేకమైన ఉద్యమం. విప్లవదక్షతా, రాజీవ్యతిరేకమైన పట్టుదలా ముఖ్యలక్షణాలు కావడంవల్ల 'మే 4' ఉద్యమం చారిత్రక ప్రాధాన్యతనొందింది. సామ్రాజ్యవాదానికీ, జమిందారీ

విధానానికీ వ్యతిరేకంగా సాగించిన 1911 విప్లవానికి పై లక్షణాలు లేవు. ఈ లక్షణాలు 'మే 4' ఉద్యమానికి కలగడానికి కారణం ఏమంటే, 1919 వరకూ ఆ మధ్యకాలంలో పెట్టుబడిదారీ ఆర్థిక విధానం ఇంకా అభివృద్ధి పొందింది. విప్లవయుతమైన ఆనాటి చైనా విద్యార్థికవర్గం ప్రపంచాన్ని అల్లల్లాడించిన మహాసంఘటనలు చూచారు. వారిలో జాతీయ విముక్తికి క్రొత్త ఆశలు రేకెత్తాయి. మొదట మహాసామ్రాజ్యాలైన రష్యా, జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ సామ్రాజ్యాలు కూలి నాశనమైనాయి; బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యాలు బలమైన దెబ్బతిన్నాయి. తరువాత రష్యను శ్రామికవర్గం తమ సోషలిస్టు మాతృభూమిని రక్షించుకుని బలపరచుకున్నారు. జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ. ఇటలీలలో శ్రామికవర్గం విప్లవ ఝంఝామారుతంలాగు విజృంభించారు.

ఈ ప్రపంచ విప్లవ విజృంభణ పిలిచింది. రష్యన్ విప్లవం పిలిచింది. మహానాయకుడు లెనిన్ పిలుపిచ్చాడు. ఫలితంగా 'మే 4' ఉద్యమం సంభవించింది. 'మే 4' ఉద్యమం, ప్రపంచ విశాలమై విజృంభించిన విప్లవంలో భాగం. ఆనాటికి చైనాలో కమ్యూనిస్టుపార్టీ లేకపోయినా, రష్యను విప్లవానికి సుస్వాగతమన్నవారూ, కమ్యూనిజాన్ని గురించి ప్రాథమిక పరిజ్ఞానం కలవారూ, అయిన విద్యార్థికులు అసంఖ్యాకులున్నారు. 'మే 4' ఉద్యమం ప్రారంభంనుంచీ ఐక్యసంఘటనతో సాగిన విప్లవోద్యమమే. ఈఐక్యసంఘటనలో కమ్యూనిస్టు మేధావులూ, విప్లవభావాలుగల మధ్య తరగతి విద్యార్థికులూ, బూర్జువా విద్యార్థికులూ వున్నారు. బూర్జువా విద్యార్థికులు ఐక్యసంఘటనలో మితవాద పక్షంగా ఉన్నారు. అయితే ఈఉద్యమంలో

కార్మిక కర్షకులు పాల్గొనలేదు. ఇదే దీని బలహీనత. తర వాత విశాల శ్రామిక జనసామాన్యము, మధ్య తరగతి బూర్జువాలూ, బూర్జువాలూ, చేరినప్పుడది. జాతినంతటినీ ముంచెత్తిన విప్లవోద్యమమైంది.

"మే 4" ఉద్యమం విప్లవసమగ్రమైన మహోద్యమం. చైనాచరిత్రలో అపూర్వ సంస్కృతీవిప్లవం చాలదూరం నడచివచ్చింది. దానికిముఖ్య నినాదాలురెండు. ఒకటిసనాతన సమాజనీతి పోవాలి; నూతననీతిరావాలి; రెండు సనాతన సారస్వతం పోవాలి, నూతనసారస్వతంకావాలి; అయినా యీసంస్కృతీవిప్లవం తగినంత విశాలమై కార్మిక కర్షక ప్రజాసామాన్యంలోకి చొచ్చుకుపోలేదు. ఉదాహరణకు ప్రజాసాహిత్యంలోని "ప్రజ" అనేపదానికి నగరవాసులని నిర్వచనమిచ్చారు. అంటే పట్టణాలలో నివశించేమధ్యతరగతి విద్యార్థులనూ, బూర్జువా విద్యార్థులకునూ ఉద్దేశించారు. ఇలాహద్దులేర్పడినా ఈఉద్యమం 1921 నాటికి కమ్యూనిస్టుపార్టీ ఏర్పడటానికి సరిపడ్డ సిద్ధాంతరంగాన్నీ, అనుసరవర్గాన్నీ సిద్ధపరచింది. "మే 30" సామ్రాజ్యవ్యతిరేక ఉద్యమానికీ ఉత్తరదేశ దండయాత్రకూ మార్గమేర్పరిచి దివిటీపట్టింది. మరోవైపున "మే4" ఉద్యమంలో మితవాదపక్షంగా ఉన్న బూర్జువా విద్యార్థికులు, ఉద్యమం రెండవదశలోకి సాగిపోయేకొలది శత్రువుతో రాజీచేసుకునే అభివృద్ధినిరోధక శిబిరంలో చేరటం మొదలుపెట్టారు.

చైనా సంస్కృతీవిప్లవ రెండవదశలో జరిగిన ముఖ్య సంఘటనల క్రమం యేమిటంటే, కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడ్డది. మే 30 ఉద్యమం సాగించబడ్డది. ఉత్తరదేశ దండ

యాత్ర జరపబడ్డది. ఈ కాలంలో, మూడు వర్గాలచేత ఏర్పడ్డ, ఐక్యసంఘటన అభివృద్ధిచెంది, రాజకీయ రంగంలో, మొట్టమొదటి సారిగా కమ్యూనిస్టు కొమింటాంగు ఐక్యత సాధ్యమైంది.

డాక్టరు సన్ యట్ సేను గొప్పదనం యెందులోఉంది? 1911 నాటి పూర్వ బూర్జువా ప్రజాస్వామిక విప్లవం నడపడంలోనే గాదు. ప్రపంచాభివృద్ధియొక్క ముఖ్యప్రవాహానికీ, మానవకోటి అవసరాలకూ, అనుగుణ్యంగా తన పంథాను సరిదిద్దగలగడంలో ఉంది ఆయన గొప్పదనం. "మూడు సూత్రాలకూ కొత్త నిర్వచనమిచ్చి, సోవియట్ తోటీ, కమ్యూనిస్టులతోటీ, కార్మిక కర్షకులతోటీ మైత్రిని కోరే మహోత్కృష్ట పంథాల కవకాశమిచ్చాడు. "కొత్త మూడు సూత్రాలను" నిర్మించాడు.

అప్పటి వరకూఉన్న మూడు సూత్రాలతో విద్యా, మత, విజ్ఞాన సంస్థలకూ; యువక సంస్థలకూ; సంబంధం ఉండేది గాదు. ఎందుకంటే ఆమూడుసూత్రాలూ జమీందారీ సంస్కృతిని విసర్జించాలని నినాదమీయలేదు. అంతవరకూ మూడు సూత్రాలు పురాతన రూపంలో ఉండేవి. గొప్పతనాన్నీ అధికారాన్నీ, ఉన్నతస్థానాన్నీ ఆశించిన ఏ కొద్ది మందికో రాజకీయ మఠాలు కట్టడానికీ, దుస్తంత్రాలు నడపకానికీ ఉపయోగపడేవి. నూతనయుగారంభం అయినప్పటినుంచీ మూడు సూత్రాలభివృద్ధిచెంది మూడు మైత్రిపంథాలకూ అవకాశం కల్పించాయి. ఈ మైత్రి పంథాల నవలంబించిన మూడు సూత్రాలకూ దేశంలో ప్రచారం యెక్కువగా జరిగింది. అన్ని పార్టీలకూ చెందిన దేశభక్తుల సంయుక్త కృషి

ద్వారా, విద్యాసంస్థల్లోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ గట్టిగా నాటుకున్నవి. అసంఖ్యాకులైన యువకుల హృదయాల్లో గాఢంగాహత్తుకున్నవి. ఇదంతా ఎలా సాధ్యపడ్డది. మూడు సూత్రాలను సామ్రాజ్యవాద జమిందారీ వ్యతిరేకాలుగా, నూతన ప్రజాస్వామికానికి అనుకూలాలుగా, మూడు మైత్రి పంథాల నవలంబించిన మూడు ప్రజాసూత్రాలుగా అభివృద్ధి చేయడం ద్వారా సాధ్యపడ్డది. ఈ అభివృద్ధే లేకపోతే మూడు సూత్రాల భావాలను ప్రచారం చేయడం అసంభవ మయ్యేది.

ఈకాలంలో యీవిప్లవకరమైన మూడు సూత్రాలు కొమింటాంగు-కమ్యూనిస్టుపార్టీ మరితర పార్టీలయొక్క ఐక్య సంఘటనకు రాజకీయపునాదియైనవి. ఈమూడుసూత్రాలూ, కమ్యూనిజమూ కూడి ఐక్యసంఘటనగా ఏర్పడ్డవి. ఈ ఐక్య సంఘటనను గురించే డాక్టరు సన్‌యట్‌సేను, "కమ్యూనిజానికీ మూడుసూత్రాలకూ దగ్గరి స్నేహం" అని అన్నాడు. వర్గ సంకలనాన్ని బట్టి చూస్తే ఐక్యసంఘటనలో మూడువర్గా లున్నవి. శ్రామికవర్గమూ, పెట్టీబూర్జువావర్గమూ, బూర్జువా వర్గమూ. దేశభక్తియుతమైన పార్టీలన్నీ "కొమింగ్ డెయిలీ న్యూస్" లాంటి మత తమ పార్టీపత్రికలద్వారా సామ్రాజ్య వాద వ్యతిరేకభావాలను ప్రచారం చేయడంలో కలిసి నడి చాయి. కన్ఫ్యూషియస్‌ను పూజించమని చెప్పే పురాతన జమీందారీయుగపు విద్యనూ, పురాణయుగ సాహిత్యాన్నీ వ్యతిరేకించాయి. సామ్రాజ్యవాద వ్యతిరేకమూ, జమీం దారీ వ్యతిరేకమూ అయిన నూతన సారస్వతాన్ని, విప్లవ నిరోధకులదాడి కెదురు నిలచి సమర్థించాయి. ప్రజల కర్థం

గాని పూర్వసారస్వతానికీ, గ్రాంధిక భాషకు వ్యతిరేకంగా ప్రజలుపయోగించే వాడుకభాషను నిలువ బెట్టినవి.

ఈ పత్రికలూ, పార్టీలూ కాంటను దండయాత్ర, ఉత్తర దండయాత్రలకాలంలో సామ్రాజ్యవాదానికీ, జమీందారీవిధానానికీ వ్యతిరేకంగా సైన్యాలల్లో ప్రచారం చేశాయి. ఇలాంటి ప్రచారం మొట్టమొదటి సారిగా జరపడమే కాకుండా దేశభక్తియుతమైన పార్టీలన్నీ కలిసి సమిష్టిగా చేశాయి. ఈ ప్రచార ఫలితంగా ఒక కొత్తసైన్యం సృష్టింపబడ్డది. 'నీచ నిరంకుశ ప్రభుత్వం నశించాలి, 'జమీందారులదోపిడి అంతరించాలి'. అనే నినాదాలు గొప్పరైతు విప్లవానికి దోహదమిచ్చాయి. పై ప్రచారంవల్లా, సోవియట్ యూనియను సాయంవల్లా ఉత్తర దండయాత్ర జయప్రదమైంది. ఫలితంగా కార్మిక కర్షకుల సాయంతో బూర్జువావర్గం అధికారాన్ని పొందింది. అధికారం హస్తగతంకాగానే బూర్జువావర్గం వెనక్కు తిరిగి తమకు సాయంచేసిన శ్రామికవర్గాన్నే అణచివేయటం ప్రారంభించింది. దీంతో కొత్తరాజకీయ పరిస్థితు లేర్పడ్డాయి.

అప్పుడు మూడోదశ ప్రారంభమైంది. 1927 నుంచి 36 వరకూ ఒకకొత్త విప్లవంసాగింది. చైనా బూర్జువాలు సామ్రాజ్య వాదులయొక్క భూస్వాములయొక్క విప్లవ వ్యతిరేక శిబిరంలో చేరిపోవడంవల్ల, ఇంతకు పూర్వదశ విప్లవం ముగిసింది; విప్లవ శిబిరంలో గొప్పమార్పు లొచ్చాయి. పూర్వపు మూడువర్గాల్లో రెండే మిగిలాయి. శ్రామిక వర్గమూ, మధ్యతరగతి బూర్జువావర్గము లేక పెట్టీబూర్జువా వర్గము. (ఈ మధ్యతరగతి బూర్జువా వర్గంలోనే రైతులూ,

విప్లవ కారులైన విద్యార్థికులూ, మరి యితర ముఠాల వారూ ఉన్నారు.)

చైనా విప్లవం యిప్పుడు కొత్తదశకు వచ్చింది. ఈదశలో విప్లవం చైనాకమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన నడవ వలసి ఉంటుంది. ఈ కాలానికి రెండు ముఖ్య లక్షణా లున్నాయి. ఒకటి: విప్లవ వ్యతిరేకులు కమ్యూనిస్టులను నాశనం చేయడానికి విశ్వప్రయత్నాలు చేశారు. రెండు: విప్లవోద్యమం ఎక్కువ తీవ్రతరమైంది. ఒకొక్క లక్షణానికి మళ్ళీ రెండుముఖాలున్నాయి. విప్లవ వ్యతిరేకులు కమ్యూనిస్టులను నాశనం చేయాలని చేసిన దండయాత్రలను రెండు మార్గాలనడిపారు. సైనికమార్గం, సంస్కృతీమార్గం. విప్లవోద్యమం తీవ్రతరంగావటంగూడా యీ రెండుమార్గాలా జరిగింది. గ్రామాలను విప్లవయుతాలుగా జేయడం ఒకటి, విశాలమైన సంస్కృతీ ఉద్యమం లేవదీయడం రెండోది.

కమ్యూనిస్టులను నాశనంచేయాలన్న పంథాను సామ్రాజ్యవాదమూ, చైనాలోనూ చైనా బైట ఉన్న విప్లవ వ్యతిరేకులూ బలపరిచారు. ఈ పంథా పదియేళ్ళ దీర్ఘకాలం నడిచింది. ఇది చేసిన ఘోరాలకూ, అత్యాచారాలకూ మితిలేదు. వేలకొలది కమ్యూనిస్టులనూ, విద్యార్థులనూ హత్య చేశారు. లక్షలాది కార్మిక, కర్షకులను నలిచి నాశనం చేశారు. ఈ హత్యాకాండకు నాయకులైనవారి కద్దులేకున్నట్లయితే చైనాలో కమ్యూనిస్టులూ, కమ్యూనిజమూ నామ రూపాలు లేకుండా పోతారా అనిపించింది. కాని కథ అడ్డం తిరిగింది. ఈ రెండురకాల దండయాత్రలూ తుక్కు తుక్కుగా ఓడిపోయినవి. కమ్యూనిస్టులను నాశనం చేయడానికి జరిపిన

దండయాత్రల ఫలితంగా చైనా యెర్రసైన్యం జపాను నెదుర్కోడానికి ఉత్తర దిక్కుగా "మహాప్రస్థానాన్ని" సాగించింది.

కమ్యూనిస్టులను నాశనం చేయడానికి సంస్కృతీ మార్గాన సాగించిన దండయాత్రఫలితంగా "డిసెంబరు 9" యువక విప్లవోద్యమం బయలుదేరింది. చివరకు కమ్యూనిస్టులను నాశనంచేయడానికి రెండుమార్గాల జరిపిన దండయాత్ర ఫలితంగా జాతియంతా మేల్కొన్నది. ఇవి అనుకూలఫలితాలు.

వ్యతిరేక ఫలితాలుగూడా వున్నాయి. బలమైనశత్రువొకడు మనగడ్డపైన అడుగుపెట్టాడు. ఇందువల్లనే ఆప దేశ్యా కమ్యూనిస్టు వ్యతిరేక దండయాత్రలు జరిగినందుకు చైనాప్రజలిప్పటికీ ఎంతో దుఃఖపడుతుంటారు. ఒకవిచిత్రం. సంస్కృతీ సంస్థల్లో కమ్యూనిస్టులకు పలుకుబడిలేకపోయినప్పటికి ఆరంగంలో కమ్యూనిస్టులపైన చేసినదండయాత్రలు విఫలమైనవి! ఈవిషయం ఆలోచించదగ్గది. అంతేగాదు; యీదండయాత్ర ఫలితంగానే, కమ్యూనిస్టయినలూసూన్ చైనా సంస్కృతీవిప్లవానికి నాయకుడైనాడు.

ఈకాలంలోజరిగిన పోరాటాలలో విప్లవశిబిరం సామ్రాజ్యవాదానికీ, జమీందారీ విధానానికి వ్యతిరేకమైన నూతన ప్రజాస్వామికాన్నీ, కొత్తమూడుసూత్రాలను కూడదీసినిలువబెట్టింది. విప్లవవ్యతిరేక శిబిరంలో సామ్రాజ్యవాదుల పురమాయింపుక్రింద బూర్జువా-జమీందారుల సమిష్టినిరంకుశత్వం పెరిగిపోయింది. ఈనిరంకుశప్రభుత్వం, రాజకీయరగంలోనూ సంస్కృతీరంగంలోనూ గూడా డాక్టర్ సన్ యట్ సేన్ ప్రతి

పాదించిన మూడుసూత్రాలనూ లేక మూడు పంథాలనూ తుడిచి పెట్టింది. చైనాకు సంభవించినఘోరాతిఘోరవిపత్తులకు బాధ్యత ఈనిరంకుశప్రభుత్వానిదేనని చెప్పాలి.

చైనా సంస్కృతీ విప్లవం నాలుగోదశ ప్రస్తుతజపాను వ్యతిరేక యుద్ధకాలమే. ఈదశలో చైనావిప్లవం నడక కొత్త పోంపులు తిరిగింది. తిరిగి ఐక్యసంఘటన మూడు పార్టీలతో ఏర్పడ్డది. ఇంతేకాక యీసారి ఐక్యసంఘటన కవకాశం యెక్కువైంది. పాలకవర్గంతోసహా పైబూర్జువా వర్గమూ, పెట్టీబూర్జువాలతో సహా మధ్యతరగతులూ, శ్రామికులతో సహా బీదప్రజలూ, అందరూ జపాను వ్యతిరేక పోరాట దీక్షతో యీఐక్యసంఘటనలో భాగస్వాములుగా చేరారు.

యుద్ధం మొదలెట్టినప్పటినుంచీ 'హాంకో' పట్టణ పతనంవరకూ ఈకాలంలో మొదటి ఘట్టమనవచ్చును. ఈ దశలో అన్ని వేపులనుంచీ దృష్టి ఆశాసూచకంగాఉంది. మన దేశ రాజకీయాలంతకంతకూ, ప్రజాతంత్రాలైనవి. మన సంస్కృతిలోగూడ సర్వతోముఖమైన ఉత్సాహంవచ్చింది.

కాని యీకాలంలో రెండవ ఘట్టంలో, అంటే 'హాంకో' పతనం దగ్గరనుంచీ సాధారణంగా దశ తిరిగి పోయింది. పెద్దబూర్జువాలలో ఒక భాగం శత్రువుకు లొంగి పోయారు. మరోభాగం అసలు యీజపాను వ్యతిరేకపోరా టాన్ని ఆపివేయాలని చూస్తున్నారు. పరిస్థితుల్లో వచ్చిన యీమార్పుకు ప్రతిబింబంగానే, యేచింగ్ అని ఒకట్రాట్స్కీ వాది చాంగ్-చుక్-మాయ్ అనే నేషనల్ సోషలిస్టు

పార్టీ నాయకుడూ కలసి ఒక అభివృద్ధి నిరోధక ఉద్యమాన్ని లేవదీశారు. పత్రికా స్వాతంత్ర్యం అడుగంటింది.

పైకి ముంచుకొచ్చిన ఈ ఆంతరంగిక సంక్షోభాన్నుంచి గడచి, బయటపడాలంటే జపాన్ వ్యతిరేక ప్రతిఘటనకు, ఐక్యతకూ, అభ్యుదయ భావాలకూ వ్యతిరేకులైన వారందరినీ పట్టుదలతో ఎదుర్కోవాలి. ఈ పోకడలను అరికట్టకపోతే యుద్ధంలో జయంపొందటం అసంభవం. అభివృద్ధి నిరోధకులపై జరిపే యీ పోరాటం ఏంగాబోతున్నది అన్నదే ప్రజలందరి ఆదుర్దా. అయినా ఒకటి చెప్పొచ్చు. దేశంలోనూ, విదేశాల్లోనూ నేడున్న అనుకూల పరిస్థితుల మూలంగా ఎందరెన్ని అడ్డంకులు పెట్టినాసరే చైనా ప్రజలు జయం పొందడం తప్పదు. 'మే 4' ఉద్యమం దగ్గరనుంచీ నేటివరకు గడచిన ఇరవై యేళ్ళలోనూ వచ్చిన అభివృద్ధి, అంతకు పూర్వం ఎనభై యేళ్ళలో వచ్చిన అభివృద్ధికన్నా యెక్కువ. ఎందుకూ, చైనా చరిత్రలో పూర్వపు వెయ్యేళ్ళలో వచ్చిన అభివృద్ధికన్నా ఈ యిరవై యేళ్ళలో వచ్చిన అభివృద్ధి యెక్కువ. ఈ లెక్కన చూచుకుంటే మరి యిరవైయేళ్ళకు చైనా యెలా ఉండబోతుందో ఊహించుకోడం సులభమే. ఇంటా, బయటా వీస్తున్న చెడుగాలి యీ సంక్షోభాన్ని తెచ్చిపెట్టినప్పటికీ ఉన్న పరిస్థితులవల్ల ఒకటి స్పష్టమౌతుంది. మన శత్రువులు విపరీతమైన నిస్పృహలోబడ్డారు. చైనా ప్రజల విజయం సమీపించింది. ప్రపంచ మంతటికీ యిదేనిజం. ప్రాచ్య దేశాలకుగూడా యిదే నిజం.

తీవ్రమైన పోరాటంవల్లగాని దేన్నీ సాధించలేము. నూతన సంస్కృతి విషయంలోనూ అంతే. ఇరవైయేళ్ళ

పాటు, మెలికలూ, వంపులూ, తిరిగిన మన ప్రయాణంలో చెడూ, మంచీ అన్నీ అనుభవించాం.

రాజకీయాధికార విషయంలో వలెనే సంస్కృతీ సమస్య విషయంలోనూ సనాతన బూర్జువాలు పొరపాటు పడుతున్నారు. నూతన దశయొక్క చారిత్రక ప్రత్యేకతను వారెరుగరు. నూతన ప్రజాస్వామికం యొక్క లేక, కొత్త మూడు సూత్రాల యొక్క ప్రజా సంస్కృతినీ త్రోసి రాజం టున్నారు. బూర్జువా నిరంకుశత్వం వారి దృక్పథానికి పునాది.

అమెరికాలోనూ, యూరపులోనూ చదివి వచ్చిన కొంతమంది (ఒకకొంతమంది మాత్రమే) సంస్కృతీ రంగం లోంచి కమ్యూనిస్టులను తుడిచిపెట్టే ప్రయత్నాల్లో సహాయం చేశారు. వారే నేడు కమ్యూనిస్టులను అరికట్టే వైఖరినీ, కమ్యూనిజాన్ని రూపుమాపే వైఖరినీ ప్రోత్సహిస్తున్నారు. కార్మిక కర్షకుల్లో సంస్కృతీ పరిణామం, రాజకీయోత్సాహము, రావడం వారికిష్టంలేదు. కాని సనాతన బూర్జువాల యొక్క నిరంకుశ వైఖరి ప్రజల్లో పనిచేయడంలేదు. రాజకీయాల్లోవలెనే సంస్కృతిలోనూ, వారికృషి చవుకు దున్నినట్లాతున్నది. వారికి చైనాలోగాని, బైట ప్రపంచంలోగాని ఉండేపరిస్థితులు అనుకూలంగాలేవు. కాబట్టివారు సంస్కృతీ రంగంలో నిరంకుశత్వాన్ని యింతటితో కట్టిపెడితే మంచిది.

అయితే సోషలిస్టు సంస్కృతిని స్థాపించ గోరడం సమంజసంగాదు. కమ్యూనిస్టుపార్టీ అంతిమ కార్యక్రమాన్ని వెంటనేఆచరణలోనికి తీసుకురావలసిన కనీసకార్యక్రమంతో కలగాపులగం చేయగూడదని తెలుసుకోలేని ఒక చిత్తక్షోభ (Confusion) వల్ల ఇలా సోషలిస్టు సంస్కృతిపైన దృష్టి

పోతుంది. కమ్యూనిస్టు దృక్పథమూ, కమ్యూనిస్టు పరిశీలనా పద్ధతి ప్రజాతంత్రయుగంలో జాతీయ విద్యా విధానాన్నీ, జాతీయ సంస్కృతీ నిర్మాణాన్ని పరిశీలించడంలో అర్ధంచేసుకోవడంలో, నడపడంలో ఉపకరిస్తాయి.

సోషలిస్టు పునాదిగల జాతీయ సంస్కృతి సోషలిస్టు ఆర్థిక రాజకీయవ్యవస్థకు ప్రతిబింబంగా ఉండాలి. కాని, సోషలిస్టు ఆర్థిక రాజకీయవ్యవస్థనుయికముందెప్పుడో నిర్మింపనున్నాము. ఇప్పటికి మటుకు సోషలిజంపైన ఆధారపడిన జాతీయ సంస్కృతిని నిర్మించడం అసంభవం.

అయితే యిదిగూడ సత్యాతిసత్యమే. ఏమంటే, చైనావిప్లవం, ప్రపంచ శ్రామిక విప్లవంలో ఒక భాగమైనట్లే, చైనా సంస్కృతీవిప్లవం ప్రపంచ సోషలిస్టు విప్లవ సంస్కృతీ ఉద్యమంలో ఒక భాగము, ఒక మిత్రమూనూ. అలాఅన్నంత మాత్రంచేత చైనాసంస్కృతి సోషలిస్టు సంస్కృతి గాబోదు. సామ్రాజ్యవాద వ్యతిరేకమూ, జమిందారీ విధాన వ్యతిరేకమూ అయిన ఒక నూతన ప్రజా సంస్కృతి మాత్రమే. చైనా విప్లవాన్ని శ్రామిక నాయకత్వంనుండి విభజించలేము. అలాగే నేటిచైనా సంస్కృతిగూడా చైనా శ్రామిక విప్లవ నాయకత్వంక్రింద తప్ప పెంపొందలేదు. అంటే కమ్యూనిజం యొక్క నాయకత్వంక్రిందతప్ప పెంపొందదు. అయితే యీ నాయకత్వం నూతన ప్రజాస్వామిక యుగంలో, సామ్రాజ్యవాదానికీ, జమిందారీ విధానానికీ వ్యతిరేకమైన ప్రజా రాజకీయ సంస్కృతీ విప్లవంయొక్క నాయకత్వమేగాని, సోషలిస్టు దశలో వుండవలసిన రాజకీయ సంస్కృతీ విప్లవ నాయకత్వం మాత్రంగాదు.

కాబట్టి నూతన సంస్కృతి యింకా నూతన ప్రజాస్వామిక సంబంధమైనదే. సోషలిస్టు సంబంధమైనదిగాదు. అయినప్పటికీ యీరోజున కమ్యూనిస్టు దృక్పథాన్నింకా యెక్కువగా ప్రచారంచేయాలి. మార్క్సు, లెనిన్, ఉపదేశాలనింకా యెక్కువగట్టిగా అధ్యయనం చేయాలి. ఇది జరగకపోతే సోషలిస్టు దశలో చైనావిప్లవాన్ని నడపడ మసంభవమే కాకుండా నేటిచైనా విప్లవం జయప్రదం గావడమే అసంభవమౌతుంది.

కాబట్టి ప్రస్తుత జాతీయ సంస్కృతి సోషలిస్టు సంస్కృతిగాదు. మరి అది నూతన ప్రజాస్వామిక సంస్కృతి. ప్రజల యొక్క, సామ్రాజ్య వ్యతిరేక, జమిందారీ వ్యతిరేక సంస్కృతేగాని, పెట్టుబడిదారీ విధాన వ్యతిరేకమైన జమిందారీ సంస్కృతిగాదు. అందువల్ల మనం కమ్యూనిస్టుదృక్పథాన్నీ, సోషలిస్టు ఆశయాన్ని ప్రజలకు విశదపరచడానికీ, నూతన ప్రజాస్వామికాన్నిస్థాపించడం కొరకు, వెన్వెంటనే ఆచరించవలసిన కార్యక్రమానికీ, భేదం తెలుసుకోవాలి. పరిశోధన, అధ్యయన, కార్యాచరణలలో కమ్యూనిస్టు పద్ధతికీ, నూతన ప్రజాస్వామికాన్ని స్థాపించడంకొరకు అవసరమైన జాతీయ ప్రబోధపద్ధతికీ భేదం గుర్తించాలి. ఈ రెండు పద్ధతులనూ కలగాపులగం చేయడం అంటే తప్పకుండా పొరపాటు పడడమే.

# నూతన సంస్కృతియొక్క స్వభావం

పై వివరణనుంచి మనం తెలుసుకోగలిగిందేమిటి? ప్రస్తుత నూతన చైనా సంస్కృతి బూర్జువా ప్రాబల్యంలో ఉండేదిగాదు. శ్రామికవర్గంయొక్క సోషలిస్టు సంస్కృతీ గాదు. నూతన చైనా సంస్కృతి అంటే ప్రజా సంస్కృతి దానిస్వభావం సామ్రాజ్యవాద వ్యతిరేకత్వా, జమీందారీ వ్యతిరేకతానూ. దానికి మార్గదర్శి శ్రామికవర్గ సిద్ధాంతం- అంటే నూతన స్వరూపాన్ని పొందిన మూడు సూత్రాల ఉత్సాహం దాని ఆచరణకు ఆధారం.

ఆ నూతన ప్రజాస్వామికసంస్కృతి జాతి యంతటి సొత్తు. అది సామ్రాజ్యవాద నిర్బంధాన్ని ప్రతిఘటిస్తుంది. చైనా జాతీయ స్వాతంత్ర్యాన్నీ, గౌరవాన్నీ నిలుపుతుంది. ఆ సంస్కృతి మనజాతిది. ప్రత్యేక లక్షణాలన్నీ దానిలో మూర్తీభవించిన జాతియొక్క వించినవి. అంతేగాదు. ఇతరజాతుల యొక్క శ్రామిక, ప్రజాస్వామిక అభ్యుదయ ఉద్యమాలతో పొత్తుగలసి పరస్పర ప్రభావపూర్వకమైన సంబంధాలతో నిత్యాభివృద్ధిని పొందుతూ నడుస్తుంది. ప్రపంచ అభ్యుదయ సంస్కృతీ ఉద్యమంలో భాగమై పోతుంది.

చైనా విదేశాల అభ్యుదయ సంస్కృతి నుంచి చాల నేర్చుకోవలసిఉంది. ఒక్క శ్రామిక సంస్కృతినీ అభ్యుదయ ప్రజాస్వామిక సంస్కృతినేగాదు, మధ్యయుగ సంస్కృతిలో మనకుపయోగమైనదానిని గూడ తీసుకోవాలి. ఉదాహరణకు

పెట్టుబడిదారీ దేశాల ప్రాథమిక అభివృద్ధిదశలో వర్ధిల్లిన సంస్కృతీ సంప్రదాయాలను మనం అందుకోవాలి. కాని విదేశీయమైనదానినంతా, గుడ్డిగా, విచక్షణలేకుండా గ్రహించరాదు. మన శరీరం ఆహారాన్నెలా జీర్ణం చేసుకుంటుందో అలా చేయాలి. ఆహారాన్ని ముందు నములుతాము. తరువాత అది జీర్ణకోశంలో రెండు భాగాలౌతుంది. ఒకభాగం నెత్తురులో కలిసిపోయి పుష్టినిస్తుంది. చెత్తయై నిరుపయోగమైన రెండవభాగం వెలుపలకు నెట్టివేయబడుతుంది.

"సంపూర్ణంగా పాశ్చాత్యవిధానాన్ని చేపట్టాల"నడం తప్పు. అన్ని విషయాలూ విదేశాలనుండి చాపచుట్టగా దిగుమతిచేయడంవల్లచైనాకు చాలా హానికలిగింది. మార్క్సిజాన్ని చైనాకు వర్తింపజేయడంలోగూడ కమ్యూనిస్టులు ఈవిధమైన జాగ్రత్తనే వహించాలి. మార్క్సిజాన్ని వర్తింపజేయడంలో మొండితనంగాని పరిస్థితులను నిర్లక్ష్యంజేయడంగాని పనికిరాదు. అలావర్తింపజేసిన మార్క్సిజం నిరుపయోగం, మార్క్సిజంలోని సార్వజనికమైన సత్యాలేవో గ్రహించి, వాటిని చైనావిప్లవంలో ప్రత్యక్ష కార్యాచరణకు వర్తింపజేయాలి. అంటే మార్క్సిజాన్ని ముందు చైనా జాతీయం చెయ్యాలి, పరిస్థితులకు వర్తింపని మొండి మార్క్సిజాన్ని అనుసరించడమంటే, మార్క్సిజాన్ని, చైనావిప్లవాన్ని ప్టిది బొమ్మల్ని చేసిపెట్టడమేనన్నమాట. ఇలాంటిమార్క్సిస్టులకు విప్లవశిబిరంలోతావులేదు. చైనాసంస్కృతికి స్వకీయమైన రూపం ఉండాలి. స్వీయజాతీయ రూపం వుండాలి. జాతీయ

రూపము, నూతనప్రజాస్వామిక స్వభావము - నేటి ఇవీ మన చైనాసంస్కృతికి వుండవలసిన లక్షణాలు.

ఈ కొత్త ప్రజాస్వామిక సంస్కృతి శాస్త్రీయమైనది. జమీందారీ యుగాలనాటి మూఢనమ్మకాల నన్నింటినీ వ్యతిరేకిస్తుంది. అనుభవైక సిద్ధమైన దృక్పథాన్ని, భౌతిక పరిస్థితుల్లో ఏది సత్యమని అన్వేషించే దృక్పథాన్ని, సిద్ధాంతానికీ ఆచరణకూ సమన్వయమున్న దృక్పథాన్ని అనుసరిస్తుంది. ఈ విషయంలో చూస్తే చైనా బూర్జువాల శాస్త్రీయ దృక్పథం, కొంతమంది అభ్యుదయ పరులైన బూర్జువా తత్వవేత్తల భౌతికవాదాన్నీ ప్రకృతి శాస్త్రదృక్పథాన్నీ జీర్ణంచేసుకున్నది. సామ్రాజ్యవాదానికీ జమీందారీ విధానానికీ మూఢ విశ్వాసాలకూ వ్యతిరేకంగా అభ్యుదయ శక్తుల సమిష్టి సంఘటనను నిర్మించడంలో జయంపొందింది. ఐతే జాగ్రత్త పుచ్చుకోవలసిందేమంటే, దీనిని మనకొత్త సంస్కృతితో సమన్వయం చేసేప్పుడుఅభివృద్ధినిరోధకమైన మిథ్యావాదాన్ని ఏరూపంలో గూడా దగ్గరకు రానీయకూడదు.

కమ్యూనిస్టులురాజకీయ కార్యాచరణకొరకు వివిధములైన మత విశ్వాసాలుగల వారితో కలసి పనిచేయవచ్చును. కాని వారి వేదాంతంతోగాని. మతంతోగాని, ఏ విధమైన సంబంధమూ ఉండగూడదు. చాలా దీర్ఘమైన జమీందారీ యుగంలో, చైనా మహోజ్వలమైన పురాతన సంస్కృతిని నిర్మించుకుంది. కాబట్టి నూతన సంస్కృతీ నిర్మాణంకొరకు తప్పని సరిగా పూర్వ సంస్కృతిలోని ప్రజాస్వామిక భాగాలను జీర్ణంచేసుకోవాలి. ఇలా చేయాలంటే ముందు ఉజ్వలమైన మన పురాతన సంస్కృతిపైన జమీందారీ పాలకవర్గం

పోగుచేసిన చెత్తనంతా జాగ్రత్తగా ఏరిపారేయాలి. అందులోనుంచి నిజంగా ప్రజాస్వామికమున్నూ, విప్లవకరమున్నూ, ఐన సంస్కృతినే సంగ్రహించాలి.

చైనాయొక్క నూతన రాజకీయాలూ, నూతన ఆర్థిక విధానమూ పూర్వరాజకీయ ఆర్థిక విధానాల నుండేవస్తాయి. కాబట్టి మనం మన సాంప్రదాయాన్ని గౌరవించాలి. పూర్వ చరిత్రను కాదను గూడదు. కాని మనచరిత్రను గౌరవించడమంటే దానికొక శాస్త్రీయ గౌరవాన్నీయడమే. మన పూర్వ సంస్కృతిని గౌరవించడమంటే మన ప్రకృతాన్ని కాదని, జమీందారీ విధానపు విషంతో సహాపూర్వపుదంతా మంచిదే నని పొగడటంగాదు. కాబట్టి ప్రజలకు, ముఖ్యంగా లేత వయస్సువిద్యార్థులకు, వెనుకచూపుమాని ముందుకు చూడటం నేర్పాలి. ఈనూతన ప్రజాస్వామిక సంస్కృతి ప్రజలది. దీనిని ప్రజలలో నూటికి తొంభైమందిగాఉన్న కార్మిక కర్షకుల సేవలో ఉపయోగించాలి. క్రమేణా యీనూతన సంస్కృతి ప్రజలచేత మాది అనిపించుకోవాలి.

అనుభవరూపకంగా చెప్పాలంటే మన యెదుట ఉన్న బాధ్యత రెండుముఖాలా ఉన్నది. ఒకవైపున విప్లవ కార్యశూరులకు తర్ఫీదివ్వాలి. మరోవేపున ప్రజలకు ప్రబోధం కలుగ జేయాలి. ఈరెంటినీ సమన్వయం చేసి మన జాతీయ సంస్కృతి అంతస్తును అభివృద్ధి చేయాలి. దానిని ప్రజలకు చేర్చే మార్గాలనుకూడా అభివృద్ధి చేయాలి. సంస్కృతి ప్రజల చేతుల్లో విప్లవాన్ని సాధించగల బలమైన ఆయుధంగావాలి.

విప్లవానికి పూర్వం, విప్లవ సంస్కృతి ప్రజలను సిద్ధాంతరీత్యా తయారుచెయ్యాలి. విప్లవం జరిగే కాలంలో

సంస్కృతీ రంగం మొత్తం విప్లవరంగంలోనే ఒక భాగమై పోతుంది. విప్లవ సంస్కృతీ సాధకులు ప్రజా శ్రేణులను నడిపే సేనానాయకులౌతారు. "విప్లవ సిద్ధాంతం లేకుండా విప్లవకార్యాచరణ ఉండజాలద"ని లెనిన్ అన్నాడు. దీన్ని బట్టి విప్లవ కార్యాచరణకూ, ప్రజాసేవకూ విప్లవ సంస్కృతీ ఉద్యమం ఎంతముఖ్యమో స్పష్టమౌతుంది. కాబట్టి యీ జపాను వ్యతిరేక యుద్ధంలో అభ్యుదయ సంస్కృతీ సాధకు లందరినీ ప్రత్యేక దళాలుగా ఏర్పరచాలి. ఈసాధకులు తమ సంస్కృతిని ప్రజలకివ్వక తమ సొంత సొత్తుగా అట్టిపెట్టు కుంటే వాళ్ళు నామ మాత్ర నాయకులుగానే ఉండిపోతారు. వాళ్ళు చేయగలిగిందేమీ ఉండదు. ఇది దృష్టిలో పెట్టు కుంటే, సంస్కృతి కంతటికీ ప్రజలేమూలం గాబట్టి ప్రజల యొక్క వాడుకభాషకు సాధ్యమైనంత దగ్గరగా ఉండేటట్లు వ్రాతభాషను కాలపరిస్థితుల ననుసరించి మార్చాలి.

**ము గిం పు**

మన జాతీయ సంస్కృతియొక్క స్వభావం సామ్రాజ్య వ్యతిరేకము, జమీందారీ వ్యతిరేకమూనూ. అలాంటిదే మన నూతనప్రజాస్వామిక సంస్కృతి. చైనా జాతియొక్క కొత్త మూడు సూత్రాల సంస్కృతి.

మన చైనాజాతియొక్క నూతన ప్రజాస్వామిక ప్రభుత్వ మహాసౌధం స్వరూపంలోనూ, స్వభావంలోనూ గూడా, నూతన ప్రజాస్వామిక రాజకీయాలూ, నూతన ప్రజా స్వామిక ఆర్థిక విధానమూ, నూతన ప్రజాస్వామిక సంస్కృతీ- యీ మూటియొక్క కలయికయే. ఇలాంటి నూతన చైనానే మనం నిర్మించడానికి కృషిచేస్తున్నాం. ఇలాంటి మన చైనా

కోరకందరూ నిరీక్షిస్తున్నారు. ఈ నూతన చైనాకు మా స్వాగతం. నూతన చైనాభాను డుదయిస్తూన్నాడు. హర్షధ్వానాలతో ఆహ్వానిస్తున్నాం.

పిడికిలి నెత్తి ప్రతిజ్ఞ చెయవోయ్
నూతన చైనా మన దేనోయ్.

# మాసె - టుంగ్ జీవితము



మాసె - టుంగ్ నేడు చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకుడు. 1893లో హ్యూనాన్ రైతుకుటుంబంలో పుట్టాడు. మావ్ (మాసె-టుంగ్) చిన్నతనంలోనే చైనాజాతీయోద్యమంలో ఆసక్తిచూపాడు. మంచూ నిరంకుశత్వాన్ని విదేశసా

సామ్రాజ్యవాదాన్ని పడగొట్టి స్వతంత్రం సంపాదించాలని ఉవ్విళ్ళూరాడు.

చాంగ్షాపాఠశాలలో చదువుతూండగా మావ్ విద్యాలయాల్లో నూతన చైనా సారస్వతసమితిని స్థాపించాడు. ఈసమితి సభ్యులు చాలమంది నేడుకమ్యూనిస్టుపార్టీలో ప్రముఖవ్యక్తులైనారు. సియాంగ్ చియాంగ్ రివ్యూ అనే విద్యార్థిపత్రికను నడిపాడు. ఈపత్రికకు దక్షిణచైనావిద్యార్థులలో చాలాపలుకుబడి వుండేది.

పాఠశాలవదిలిన తరువాత ,వుపాధ్యాయుడుగా వుంటూనే, మావ్ రాజకీయాలలో పనిచేస్తూండేవాడు. 1917 రష్యనువిప్లవం అతనిహృదయాన్ని చాలాకదలించింది. అప్పటినుంచీ కమ్యూనిజాన్ని చదివాడు. 1921లో చైనాకమ్యూనిస్టుపార్టీప్రారంభ సమావేశము జరిగినప్పుడు మావ్ చైనాకమ్యూనిస్టుపార్టీ హ్యూనాన్ రాష్ట్రకమిటీ సభ్యుడైనాడు. 1922లో హ్యూనాన్ రాష్ట్రం మావ్ నాయకత్వంక్రింద విప్లవప్రజావుద్యమానికి కేంద్రమైంది.

అవి సన్ యట్ - సేన్ నాయకత్వం క్రింద కొమింటాంగు కమ్యూనిస్టు ఐక్యతకుదిరిన శుభదినాలు. రెండుపార్టీలూ చైనా ప్రజాస్వామిక విప్లవాన్ని జయప్రదంగా నడిపినవి. కాంటన్ నుంచి వెలువడే కొమింటాంగుపార్టీ వారపత్రికకు మావ్ సంపాదకుడైనాడు. తరవాత కొంతకాలానికి కొమింటాంగు ప్రచారకశాఖ అధ్యక్షుడును, కొమింటాంగు కేంద్ర కమిటీ సహాయ సభ్యుడునూ అయినాడు. సన్ యట్ సేను చనిపోయింతరవాత కొమింటాంగులోని అభివృద్ధి నిరోధకులైన సభ్యులు కొంతమంది కొమింటాంగు కమ్యూనిస్టుపార్టీల

మధ్య వినాశకరమైన చీలికలుబెట్ట ప్రయత్నించారు కమ్యూనిస్టుపార్టీపైన దుష్కీర్తిపోయ నారంభించారు. మావ్ చైనా కార్మిక కర్షకసైన్యం మొదటి దళాలను తయారు చేశాడు. 1931లో ఆగ్నేయ చైనాలో స్థాపించబడ్డ సోవియట్ చైనాకు మావ్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. అప్పుడు సర్వసైన్యాధ్యక్షుడుగా ఉన్నచూ-టేతో కలసి చైనా యెర్రసైన్యాలను నడిపి చియాంగ్-కె-షేక్ కమ్యూనిస్టులను నాశనం చేయాలని చైనా సోవియట్లపై సాగించిన దండయాత్రలను ఓడించాడు.

1933 ప్రారంభంలోనే మావ్ చైనాపై జపానుదండయాత్ర చేయగల అపాయాన్ని గ్రహించాడు. ఆతని నాయకత్వంక్రిందనే కమ్యూనిస్టుపార్టీ, జపాను వ్యతిరేకయుద్ధంలో సమిష్టి కార్యాచరణకు రమ్మని చియాంగుకు సూచనలనంపింది. దేశాన్ని వినాశకరమైన అంతర్యుద్ధాన్నుంచీ జపాను దురాక్రమణనుంచీ కాపాడటానికి చైనాకమ్యూనిస్టుపార్టీ మావు నాయకత్వంక్రింద వాయువ్య దిక్కుకు, చరిత్రప్రసిద్ధమైన ఎర్రసైనిక "మహాప్రస్థానాన్ని" సాగించింది. అక్కడినుంచి దండెత్తి వస్తూన్న జపాను సైన్యాలను సులభంగా యెదుర్కొనవచ్చుననే ఉద్దేశం.

చాంగ్‌సూ-లియాంగ్ తిరగబడ్డాడు. అతని సైన్యాలు చియాం-కై-షేకును ఖైదుచేశాయి; చంపబూనుకున్నాయి. కమ్యూనిస్టులే అతనిని ఖైదునుండి విడిపించారు. తద్వారా జపానువ్యతిరేక ఐక్యసంఘటనకు పునాదివేశారు. 1937లో ఐక్యసంఘటన సాధించబడ్డది.

మావ్ నాయకత్వంక్రింద చైనా కమ్యూనిస్టుపార్టీ జపానును ఓడించేందుకు అభిమానధనులైన చైనా పుత్రులంద

రితో సహకారం చేస్తామని ప్రతిజ్ఞ చేసింది. మావ్ నాయకత్వంక్రింద చైనా కమ్యూనిస్టుపార్టీ ఈ ప్రతిజ్ఞను హృదయపూర్వకంగా పాటించింది. కొమింటాంగులోని కొంతమంది జపాను అనుకూలురు ఐక్యతను భగ్నం చేయడానికి ఎంత రెచ్చగొట్టినా కమ్యూనిస్టుపార్టీ రెచ్చిపోలేదు. ఈనాడు ఎనిమిది లక్షల సభ్యత్వమూ ఐదులక్షల సాయుధ సైన్యమూ పది కోట్ల ప్రజలపై నాయకత్వమూ (ఇవి 1940 నాటి లెక్కలు) కలిగిన చైనా కమ్యూనిస్టుపార్టీ చైనా జయానికి కట్టని కంచు కోట. యుద్ధానంతరం చైనా నూతన ప్రజారాజ్యాన్ని నిర్మించగల మహాశక్తి. మావ్ యిలాంటి కమ్యూనిస్టుపార్టీకి మహానాయకుడు.





ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ—కె 13/సి —2000 కాపీలు—28.9.47



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B179 |
| పుస్తకం పేరు | చైనా నూతన ప్రజాస్వామ్యం |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |